

విరహ సమయం ఆసన్నమైనంతవరకు ప్రేమ యొక్క గాఢత, లోతు ప్రేమకే తెలియదు." ……ఖలీల్ జిబ్రాన్

# జిబ్రాన్ మార్గం

అలజంగి ఉదయ కుమార్

జీవితాన్ని ఎలా జీవించాలో చెప్పిన ఖలీల్ జిబ్రాన్ ' ది ప్రొఫెట్' కు సరళమైన తెలుగు అనువాదం

## అంకితం

మేమంతా కరోనా వైరస్ కారణంగా లాకౌట్ ప్రకటిస్తే, ఇంట్లో కూర్చొని, పుస్తకాలు చదువుకుంటూ, రాసుకుంటూ, టీ.వీ. చూసుకుంటూ, తోట పని చేసుకుంటూ, రకరకాల వంటలు వండి పెడుతుంటే వద్దనకుండా తింటూ ఇంకా అనేక రకాలు గా కాలం గడుపుతుంటే.............

ఇల్లన్నదే తెలియక, రేయనక, పగలనక, కంటి మీద కునుకు కూడా సరిగా తీయకుండా, తమ జీవితాలను కరోనా బారిన పడకుండా ఉండటానికి, కరోనా బారిన పడినవారిని మృత్యువాత పడకుండా అహరహం శ్రమిస్తున్న అసలైన మానవులందరికీ.....

రచయిత

# జిబ్రాన్ మార్గం

## నా మాట

1923 లో ఖలీల్ జిబ్రాన్ రాసిన 'ది ప్రోఫెట్' ఇప్పటికీ ఎంతో ప్రజాదరణ కలిగియుండటమే కాకుండా, అత్యధికంగా అమ్ముడుపోయిన పుస్తకాలలో మూడవ స్థానంలో ఉంది. ఇన్నేళ్ళుగా ఈ పుస్తకం ఇంత నిత్య యవ్వనంగా ఉందంటే దీనిలో ఉన్న సారమేంటి? ఆయన ప్రత్యేకత ఏమిటి? అనే ప్రశ్నలు ఎవరికైనా వస్తాయి.

ఈ పుస్తకంలోని కొన్ని అంశాలు చదవడమే తప్ప పూర్తిగా చదివడం జరగలేదు. చదివినా అందులో అనేక పదాలు గాని, ఉదాహరణలు గాని, తాత్వికత గాని, ఉపమానాలు గాని అంత సులభంగా అర్థం కావు. కాని చాలా మంది ఈ పుస్తకం గురించి మాట్లాడటం గాని, ఆయన వాక్యాలను ప్రసంగాలలో ప్రస్తుతించుట గాని చేస్తుంటారు. దీనిని **కాళోజి** గారు '**జీవన గీత**' అనే పేరు తో తన శైలి లో, తన స్థాయి లో అనువాదం చేసారు. అది నేటి తెలుగు సగటు పాఠకునికి నారికేళ పాకమే.

విశాల నీలి ఆకాశంలో చెల్లా చెదురుగా ఉన్న మబ్బుల్ని చూస్తే ఒక్కొక్కరికీ ఒక్కోలా గోచరమవుతుంటాయి. ఎవరి అనుభూతి వారిది. ఎవరి వివరణ వారిది. తత్త్వం అంతే. తాత్వికత అంతే. **ఈ పుస్తకం కూడా అంతే.** కరోనా వైరస్ కారణంగా లాకౌట్ ప్రకటించాక దొరికిన విరామ సమయంలో ఈ పుస్తకాన్ని చదవడం ప్రారంభించి, పుస్తకసారం, భారం

# జిబ్రాన్ మార్గం

అర్థం అవుతున్న కొలది నా అభిప్రాయాలను నా పినతండ్రి **అలజంగి మురళీధర్** గారి తో పంచుకోవడటం జరిగింది. సులభమైన భాషలో, అందరికీ అర్థమయ్యే రీతిలో నీవే అనువదించు అని ఆయన అనడంతో ఈ సాహసం చేసాను. ఒక్కొక్క కవితను అనువదించి వాట్సప్ లో పంపిన మరుక్షణమే ఆయన స్పందిస్తూ ప్రోత్సాహంతో పాటు మార్గదర్శకం చేసారు. జిబ్రాన్ వాడిన కఠిన ఆంగ్ల పదాలకు, క్లిష్టమైన వాక్యనిర్మాణాలకు అర్థాలు చెప్పడమే కాకుండా, రాసిన ప్రతి కవిత చదువుతుంటే, ఓపిగ్గా వింటూ చిరంజీవి **రోహస్ సాత్విక్** ఇతోధికంగా చేయూతనిచ్చాడు.

ఖలీల్ జిబ్రాన్ అర్థం అవుతున్న కొలదీ, ప్రతీ ఒక్కరూ తనను తాను అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తారని నా నమ్మకం. మీరు చదివి మీ అభిప్రాయాన్ని ఏదో ఒకరూపం లో వ్యక్త పరచండి. ఇది వచనమా? కవితా? అనే మీమాంస వద్దు. **జిబ్రాస్ మార్గాన్ని కనుగొనండి**. అతని ఆలోచనలను అర్థం చేసుకోండి. ఆర్ద్రత తో గుండెలు బరువెక్కినా, కళ్ళు చమర్చినా, ఆ ఆనందాన్ని ఆస్వాదిస్తూ ఆ మార్గం లో ముందుకు వెళ్ళండి.

**అలజంగి ఉదయ కుమార్**

traineruday kumar@gmail.com

9948992208

# జిబ్రాన్ మార్గం

## తొలి పాఠకుని స్పందన

పుస్తకాలను చదవడం ఒక వ్యాపకంగా పెట్టుకున్న నేను నా పఠనానుభవం లో తెలుసుకున్నది ఏమిటంటే, మనసును పట్టి అక్కడ శాశ్వతంగా నిలిచిపోయేవి, మనసును తట్టి మేల్కొలిపి, చైతన్యవంతుని చేసేవి ఒకటో రెండో పుస్తకాలు మాత్రమే కదా అని. ఆణిముత్యాల్లాంటి ఆ ఒకటో రెండో పుస్తకాలు చేసే పని ఏమిటంటే మనలోని "మనతనాన్ని" మనకు ఎరుకపరచడమే. ఇక మనం వాటి చుట్టూ పరిభ్రమిస్తూనే ఉంటాం ఒక కొత్త వెలుగులు నిండిన చూపుతో, ఒక కొత్త దివ్యానుభూతితో. "వీటిని చదివియుండకపోతే ఇంతటి జీవనసారాన్ని నిజంగా మనం పొందియుండలేక పోయెడి వాళ్ళం కదా!" అనే భావం అవశ్యంగా మనకి కలిగి తీరుతుంది. బహుశా ఇటువంటి పుస్తకాలను ధృష్టిలో పెట్టుకొనే **"Some books are to be digested"** అని పలికి ఉంటాడు **లార్డ్ బేకన్** మహాశయుడు.

# జిబ్రాన్ మార్గం

అదిగో అటువంటి ఒక అరుదైన పుస్తకమే మా అబ్బాయి **అలజంగి ఉదయ కుమార్** అనువదించి, అందించిన **"జిబ్రాన్ మార్గం".** ఈ పుస్తకం చదవడమే ఏ పాఠకునికైనా ఒక "యోగం". అట్లాంటిది ఈ పుస్తకానికి నేను తొలి పాఠకుడుని కావడం ఎంతటి అదృష్టమో కదా!

**"ఆర్ఫలీజు నగరవాసులారా!"** అంటూ సంభాషణ, బోధన, ప్రేమ, సంతానం, దానం, వివాహం, శ్రమ, సుఖ దు:ఖాలు, స్వేచ్ఛ, వేదన, ఆత్మ జ్ఞానం, స్నేహం, కాలం, మంచి-చెడు, ప్రార్థన, సుఖం, అందం, మతం, తినుట-త్రాగుట, గృహములు, వస్త్రాలు, క్రయ విక్రయాలు, నేరము-శిక్ష, శాసనములు, హేతువు-మోహం, మతం, మరణం ఇత్యాది సమస్త జీవితాంశములపై ఒక ఉదాత్తమైన "ప్రవక్త" పాత్ర ద్వారా **ఖలీల్ జిబ్రాన్** వ్యక్తీకరించిన ఒక సుందర సురుచిర భావ వల్లరియే 'జిబ్రాన్ మార్గం' అనే ఈ అనువాద గ్రంథం.

క్లిష్టమైన, జటిలమైన భావవ్యక్తీకరణలతో నిండియున్న జిబ్రాన్ గ్రంథం The Prophet లోని ఒక్కొక్క భాగాన్ని అనువదిస్తూ ఉదయ్ ఒరిజినల్ ఆంగ్ల భాగం దాని తెలుగు అనువాదం రెండింటినీ వాట్సప్ లో పోస్ట్ చేసేవాడు. అలా ఈ గ్రంథానికి నాకు "తొలి పాఠకుడు" అనే హోదా,

# జిబ్రాన్ మార్గం

గౌరవం లభించాయి. ఆంగ్లం, తెలుగు రెండింటినీ చదువుకుంటూ పోయేవాడిని. ఆంగ్ల వెర్షన్ లో అందని భావం, అనుభూతి నాకు వెంటనే తెలుగు అనువాదం లో లభించాయి. ఒరిజినల్ లోని క్లిష్టత ఉదయ్ అనువాదంలో దూదిపింజలా విడిపోయేది. ఒక ఉదాహరణ చూడండి **" Your Fear of Death is but the trembling of the shepherd when he stands before the king whose hand is to be laid upon him in honour"** అనే వాక్యానికి ఉదయ్ అనువాదం **" మృత్యువు పట్ల నీకున్న భయం ఎటువంటిదంటే ఒక మహారాజుచేత సన్మానం పొందుటకు వణుకుతూ నిలచున్న గొర్రెలకాపరి వంటింది."** సరళ సుందరమైన అనువాదం లోని "వైభవం" ఎంతటిదో ఇక్కడ ఉదయ్ కలం నుండి జాలువారిన పై వాక్యమే నిదర్శనం.

అత్యంత సరళంగా, హృదయ తంత్రులను మీటే సంగీతపు శ్రుతులు లా ఉదయ్ కుమార్ అనువాదం లోని ప్రతీ వాక్యం మనలను మంత్ర ముగ్ధులను చేస్తుంది. జిబ్రాన్ లోని తాత్విక గాఢతను పలుచన చేయకుండా, అత్యంత సరళమైన పదాలతో, సర్వ జనులు పలికే మాటలతో, దివ్య సంగీత సవ్వడులను పలికించగల వీణా వైణికుడు ఉదయ్ కుమార్. ఇది సత్యం. అతిశయోక్తి కానే కాదు.

# జిబ్రాన్ మార్గం

జిబ్రాన్ తాత్విక జీవన భావ వీచికలను తనివితీరా గ్రోలాలనుకుంటే, ఉదయ్ అనువాద గరిమ, రసనల ను చవి చూడాలనుకుంటే, జాగు చేయక, వెనుదిరిగి చూడక వెంటనే "**జిబ్రాన్ మార్గం**" పుస్తకపు పేజీలను తిప్పి చూడండి. వ్యక్తిత్వం వికసిస్తుంది. అనుభూతి సాగరమంతగా విస్తరిస్తుంది.

**అలజంగి మురళీధర రావు**

అసిస్టెంట్ ప్రొఫెసర్ ఇన్ ఎకనామిక్స్,

విశాఖ పట్టణం, ఫోన్: 94403 35461

## ఖలీల్ జిబ్రాన్ – ఒక దర్శనం

| | | |
|---|---|---|
| పేరు | : | ఖలీల్ జిబ్రాన్ |
| వృత్తి | : | కవి, రచయిత, చిత్రకారుడు, జర్నలిస్ట్ |
| జన్మించిన తేదీ | : | జనవరి 6, 1883 |
| మరణించిన తేదీ | : | ఏప్రియల్ 10, 1931 |
| జన్మించిన ప్రదేశం | : | బ్శార్ , లెబనాన్ |
| మరణించిన ప్రదేశం | : | న్యూ యార్క్ , అమెరికా |

లెబనాన్ లో పుట్టిన రచయిత, చిత్రకారుడైన ఖలీల్ జిబ్రాన్ ఆంగ్ల, అరబిక్ భాషలలో రాసిన తాత్విక రచనలకు పేరుగాంచాడు. 1923 లో ముద్రించబడిన ది ప్రోఫెట్ తర్వాత ఖండాతర ఖ్యాతినొందాడు.

1883 లో లెబనాన్ లో పుట్టిన ఖలీల్ జిబ్రాన్ 1895 లో 12 సంవత్సరాల వయస్సులో అమెరికా లో బోస్టన్ నగరానికి వలస వెళ్ళినాడు. బోస్టన్ చిత్రకారుల సంఘం ద్వారా వెలుగులోకి వచ్చాడు. మొదట్లో చిత్రకారునిగా మంచి భవిష్యత్తు ఉన్నట్టు అనిపించినా, వార్తా

# జిబ్రాన్ మార్గం

పత్రికల్లో కాలమిస్ట్ గా అరబిక్ భాషలో రచయిత గా, అరబిక్ భాషలో వచన కవితలతో తన ప్రతిభను వ్యక్తపరిచాడు.

న్యూయార్క్ నగరానికి తన నివాసం మార్చిన తర్వాత ఇంగ్లీష్ లో రచనలు బాగా రాయడం మొదలుపెట్టాడు. తన ప్రఖ్యాత రచన అయిన ‘ది ప్రోఫెట్’ ను 1923 లో రాసాడు. 1931 ఆయన మరణించిన పిదప, ఈ పుస్తకం మరింత బహుళ ప్రాచుర్యం పొంది, ఆంగ్ల రచనల అత్యధిక అమ్మకాలలో మూడవ స్థానం లో నిలిచింది.

**పూర్వ జీవితం:**

జిబ్రాన్ ఖలీల్ జిబ్రాన్ జనవరి 6 వ తేదీ 1883 సంవత్సరంలో లెబనాన్ దేశంలో **బ్సారీ** నగరం లో ఒక క్రైస్తవ కుటుంబంలో జన్మించాడు. బాల్యంలో సున్నితంగా, నెమ్మది ప్రవర్తన కలిగియుండే జిబ్రాన్ చిన్నతనం నుండే చిత్రలేఖనలో ఆసక్తి కలిగియుండి ప్రకృతి పట్ల మంచి అభిరుచి చూపించేవాడు, తన కవితలలో ప్రకృతి రమణీయత తదుపరి రోజుల్లో ప్రస్ఫుష్టంగా కనబడటానికి ఇదే కారణం. స్థానిక మత బోధకుల నుండి విద్యాభ్యాసానికి సంబంధించిన పాఠాలు నేర్చుకున్నప్పటికీ అతని విద్యాభ్యాసం ఒక క్రమ పద్ధతిలో జరగలేదు.

# జిబ్రాన్ మార్గం

తన తండ్రి దుడుకుస్వభావం కలిగియుండేవాడు. పన్నుల వసూలు అధికారిగా పనిచేస్తూ, నిధులను దుర్వినియోగం చేయడం వలన ఖైదు చేయబడటమే కాకుండా అతని ఆస్తులన్నీ జప్తు చేయబడ్డాయి. లెబనాన్ లో జీవితం దుర్భరం అవడం వలన, మెరుగైన జీవితం కోసం 1895 లో మసాచుసేట్స్ రాష్ట్రం లోని బోస్టన్ నగరానికి తల్లి తన కుటుంబాన్ని మార్చింది. బోస్టన్ నగరంలో దక్షిణ ప్రాంతంలో వలస వచ్చిన వారుండే ప్రాంతంలో ఆ కుటుంబం స్థిరపడింది.

**చిత్ర కారునిగా గుర్తింపు:**

13 సంవత్సరాల వయస్సులోనే అతని లోని చిత్రకళాభిరుచి ని ఫోటో గ్రాఫర్, సంపాదకుడు అయిన **ఫ్రెడ్ హాలాండ్ డే** గుర్తించి తగిన ప్రోత్సాహాన్ని, మార్గదర్శకత్వాన్ని అందించాడు.

15 సంవత్సరాల వయస్సు లో జిబ్రాన్ లెబనాన్ వచ్చి క్రైస్తవ మిషనరీ స్కూల్ లో చేరాడు. అక్కడ విద్యార్థుల కోసం ఒక పత్రిక ప్రారంభించి తన కవితా రచనలకు మెరుగు దిద్దాడు. వరుసగా తన సోదరి, సోదరుడు, తల్లి మరణించడంతో 1901 లో మరలా బోస్టన్ నగరానికి వచ్చాడు. అల్లిక పనిచేస్తూ తన సోదరి కుటుంబానికి ఆర్థికంగా ఆసరాగా

# జిబ్రాన్ మార్గం

నిలవడంతో జిబ్రాన్ తన చిత్రలేఖనం కొనసాగించగలిగాడు. డేస్ స్టూడియో నందు తానూ గీచిన చిత్రాల ప్రదర్శన ఏర్పాటు చేసాడు. అల్ మొహజెర్ అనే అరబిక్ వారపత్రికకు కాలమిస్ట్ గా రచనలు చేసాడు. తన కవిత్వాలకు తగిన చిత్రాలను తానే గీసేవాడు. తన కవితలు అరబిక్ సాంప్రదాయ రచనలకు భిన్నంగా ఏకాంతం, ప్రకృతి కి మానవునికి ఏర్పడిన దూరం గురించి ఎక్కువగా ఉండేవి. 1905 లో రెండు చిన్న కథ లతో పాటు సంగీతంపై తనకు గల మక్కువ గురించి ఒక కరపత్రం ముద్రించాడు.

స్థానిక బాలికల పాఠశాల ప్రదానోపాధ్యాయురాలు గా పనిచేస్తున్న **మేరీ ఎలిజిబెత్ హాస్కెల్** జిబ్రాన్ రచనలకు సాహితీ కార్యక్రమాలకు ఆర్ధిక సహాయం అందించేది. పారిస్ నగరంలో గల ప్రసిద్ధ 'అకడమియా జూలియన్' సంస్థ లో సభ్యత్వం పొందడంలోనూ, 1911 లో న్యూయార్క్ నగరానికి తన నివాసం మార్చడం లోను ప్రధాన పాత్ర నిర్వహించింది.

**న్యూయార్క్ లో జిబ్రాన్ జీవితం :**

న్యూయార్క్ నగరంలో రచయితల సంఘాలలో తనకంటూ గుర్తింపును సంపాదించాడు, 1912 లో Broken Wing రచనను ముద్రించాడు. జిబ్రాన్ 1914 లో తాను గీచిన చిత్రాలతో ఒక ఎగ్జిబిషన్

నిర్వహించాడు.

జిబ్రాన్ అరబిక్ వార్తా పత్రిక ఆల్-ఫనన్ కు వార్తలు రాస్తుండేవాడు. మొదటి ప్రపంచయుద్ధ కాలంలో తన జాతీయభావాలను స్వతంత్రంగా పత్రికలలో ప్రకటించేవాడు. **ఫతాట్ బోస్టన్** అనే పత్రికలో సంపాదకుడుగా పనిచేసాడు. 1920 లో అల్-రబిత్-అల్-ఖల్ మియా (The Pen Bond) అనే పేరుతొ అరబిక్ రచయితతో ఒక సంస్థను ప్రారంభించాడు.

మేరీ హాస్కల్ సహాయ సహకారాలతో 1918 లో The Mad Man, 1920 లో The Forerunner అనే కవితా సంకలనాలను ఇంగ్లీష్ లో ప్రచురించాడు. తాను స్వయంగా గీసిన 20 చిత్రాలను The Procession అనే గ్రంధాలను 1919 లో ప్రచురించాడు.

**ది ప్రోఫెట్ తదనంతర రచనలు – మరణం:**

1923 లో జిబ్రాన్ తనకు ఎంతో పేరు ప్రఖ్యాతులు తెచ్చిన The Prophet ప్రచురించాడు. అల్ ముస్తాఫా అనే ఒక పాత్ర ద్వారా జీవితంలోని 26 విభిన్న పార్శ్వాల మీద కవితా పూర్వక వ్యాసాలను అద్భుతంగా వ్యక్తపరిచాడు. ఈ పుస్తకం మీద అతి తక్కువ సమీక్షలు వెలువడినప్పటికీ అతి తక్కువ కాలం అధిక ప్రతులు అమ్ముడుపోయి జీవితంలో

# జిబ్రాన్ మార్గం

మొట్టమొదటి సారిగా కీర్తి ప్రతిష్టలంటే ఏమిటో అనే రుచిని జిబ్రాన్ కలిగించింది.

న్యూయార్క్ లోని న్యూ ఓరియంట్ సొసైటి అధికారిగా జిబ్రాన్ నియమితులయ్యారు. ఈ సొసైటి బెర్ట్రాండ్ రస్సెల్, హెచ్,జి,వేల్స్ వంటి ప్రముఖ రచయితుల వ్యాసంగాలను ప్రచురిస్తుండేది. 1928 లో చారిత్రిక, కాల్పనిక పాత్రల ద్వారా క్రీస్తు బోధనల ప్రతిబింబించే విధంగా Jesus, The Son of Man అనే ప్రఖ్యాత సంకలనాన్ని రచించాడు.

ఈ సమయానికి జిబ్రాన్ మద్యపానానికి బానిసవడమే కాకుడా ఒంటరి జీవితానికి అలవాటు పడ్డాడు. 1931 లో The Earth Gods అనే చివరి పుస్తకాన్ని ప్రచురించాడు. 1932 లో The Wanderer అనే పుస్తక లిఖిత ప్రతిని పూర్తి చేసి ముద్రించబడేలోగా 1931 సంవత్సరంలో April 10 వ తేదీ న కాలేయంలో సిరియోసిసి వ్యాధి తో మరణించాడు.

**న్యాయ పోరాటం – ఖలీల్ ఖ్యాతి :**

జిబ్రాన్ మృతదేహాన్ని లెబనాన్ దేశంలోని బ్సార్ పట్టణంలో గల మార్ సర్కిస్ మానస్టరీ నందు ఖననం చేయబడింది. తరువాత అది ఒక మ్యూజియం గా మార్చబడింది. తన వీలునామా నందు తన రచనల

# జిబ్రాన్ మార్గం

వలన రాయల్టీగా సంక్రమించిన డబ్బును తన స్వంత పట్టణమైన బ్సార్ అభివృద్ధికి ఉపయోగించాలని రాయడంతో ఆ డబ్బుల వినియోగంపై అనేక రకాలైన చట్టబద్ధమైన  వివాదాలు తలెత్తాయి.

ఈ డబ్బులను ఎలా ఖర్చు చేయాలనే విషయం పై బ్సారీ పట్టణ ప్రజలలో దశాబ్దాల తరబడి వివాదాలు కొనసాగాయి, చివరకు ప్రభుత్వ జోక్యం తో ఈ వివాదం  ముగిసింది.

'ది ప్రోఫెట్' పుస్తక ప్రజాదరణ చిరకాలం కొనసాగింది. 1960 దశకం లో అమెరికా లో వచ్చిన సాంస్కృతిక వైరుధ్య ఉద్యమానికి ఈ పుస్తకం ఉత్తేజం ఇచ్చింది. వారానికి 5,000 లకు పైగా ప్రతులు అమ్ముడుపోయి సంచలనం సృష్టించింది.  తాను  జీవించి ఉండగా అనేక విమర్శలకు, ప్రతి దాడులకు గురైన జిబ్రాన్ చివరకు షేక్ స్పియర్, లావో-జ్యు తర్వాత ప్రపంచంలో మూడవ అత్యధిక కవితా సంకలనాలు అమ్ముడుపోయిన రచయితగా మూడవ స్థానంలో నిలిచాడు.

మేరీ హాస్కల్ భద్రపరిచిన  జిబ్రాన్ డైరీ ల వలన జిబ్రాన్ జీవిత విశేషాలు సవివరంగా తెలుసుకోడానికి అవకాశం కలిగింది. 2008 లో ఖలీల్ జిబ్రాన్ రచనల సంగ్రహం ముద్రించబడింది. 2014 లో ఖలీల్ జిబ్రాన్

# జిబ్రాన్ మార్గం

ప్రసిద్ధ రచన ది ప్రోఫెట్ యానిమేడ్ చిత్రం గా తయారు చేయబడి, ప్రజాదరణ పొందింది.

కాలాతీతమైన భావనలకు, విస్తృతమైన ఆలోచనలకు పేరుగాంచిన ఖలీల్ జిబ్రాన్ రచనలు ఇప్పటికీ మంచి ప్రాచుర్యం కలిగి ఉన్నాయి. వీటిని అధ్యయనం చేయాల్సిన అవసరం నేటి తరానికి ఎంతైనా ఉంది.

జిబ్రాన్ – రచనల జాబితా:

1) Spirits Rebellious (1908)
2) The Madman (1918)
3) The Broken Wings (1912)
4) The forerunner (1920)
5) A Tear and A Smile (1914)
6) The Prophet (1923)
7) The Procession (1918)
8) Sand and Foam (1926)
9) Jesus, the son of man (1928)
10) The new frontier
11) The earth gods (1931)
12) I believe in you
13) The wanderer (1932)
14) my countrymen
15) The garden of the prophet (1933)
16) Satan
17) Lazarus and his beloved (1933)
18)Your thought and mine
19) You have Your Lebanon and I have my Lebanon

# జిబ్రాన్ మార్గం

ఖలీల్ జిబ్రాన్ విశిష్టమైన హృదయం కలిగియుండి, ప్రేమపూర్వక, ఆధ్యాత్మిక శక్తిను కలిగి యుండేవాడు అని చెప్పవచ్చు. విశాలమైన ఆలోచనలు కలిగియుండి, ఆధ్యాత్మిక విషయాలను తెలుసుకోవాలనే తపన కలిగియుండేవాడు. మనిషి అనేవాడు సమాజంలో భాగస్వామిగా ఉంటూ, వ్యక్తిగతంగా స్వేచ్ఛను పొందాలని భావించేవాడు.

అన్నింటికన్నా చెప్పుకోదగ్గ విషయం ఏమిటంటే జిబ్రాన్ సోమరి కాదు. కలల బేహారిగా జీవితాన్ని గడపలేదు. తనకు సత్యమనిపించిన దాన్ని, తనకు తెలుసు అన్నదాన్ని ఇతరులతో పంచుకోడానికి ఆసక్తి చూపేవాడు.

'అనంతానికి మనం ఒక దర్పణంలా ఉన్నప్పుడు, మనలో నిద్రాణమైన శక్తులగురించి తెలుసుకోడానికి, సరియైన సూచన లభించినపుడు మేల్కొడానికి సిద్ధంగా ఉండాలన్నదే' జిబ్రాన్ ప్రపంచానికి ఇచ్చిన మహత్తర సందేశం.

రండి ...జిబ్రాన్ మార్గం తెలుసుకుందాం. ప్రయాణం సాగిద్దాం.

# జిబ్రాన్ మార్గం

## నౌక కొరకు ఎదురుచూపు

అనేక మందిచేత ఇష్టపడే, అందరిప్రేమకు పాత్రుడైన, తన జీవితానికే ఒక ఉషోదయమైన **అల్ ముస్తాఫా** తన నగరమైన ఆర్ఫలీజు నందు పన్నెండు సంవత్సరాలు పాటుగా తాను పుట్టిన ప్రదేశం నుండి తాను ఎక్కడినుండి వచ్చియున్నాడో అక్కడకు తీసుకొనుబోవు నౌక కొరకు ఎదురుచూస్తున్నాడు.

పన్నెండవ సంవత్సరమునందు  పంటలు కోయు నెలలో, 'లీలూల్ ' అనబడే  ఏడవరోజున  నగర ప్రాకారము దాటి ఎత్తైన కొండను ఆరోహించి సముద్రం వైపు చూడగా, మంచుతెరల వెనుక లీలగా ఓడ వస్తున్న దృశ్యం చూసాడు. తన హృదయ కవాటాలు ఒక్క ఉదుటున విప్పారగా, అతనిలో ఆనందం సముద్ర తరంగాలవలె ఉప్పొంగగా, కనులు మూసుకొని తన మనసులో నిశ్శబ్దంగా ప్రార్ధనలు చేసాడు.

కొండను దిగి వస్తుండగా అతని మనసులో దిగులు ఆవహించింది. దుఖం నుండి విముక్తి కాకుండా ప్రశాంతంగా తాను ఎలా వెళ్ళగలనని మనసులో ఆలోచించడం ప్రారంభించాడు. ఆత్మ లో ఒక్క గాయం లేకుండా ఈ నగరాన్ని ఎలా విడిచిపెట్టగలను?  ఈ నగరం గోడల లోపల,  బాధలతో

# జిబ్రాన్ మార్గం

అనేక రోజులు గడిపియుంటిని. అనేక రాత్రులు ఒంటరిగా గడిపియుంటిని. నా బాధను, ఒంటరితనాన్ని పశ్చాతాప పడనీయకుండా ఎవరు నన్ను విముక్తుణ్ణి చేయగలరు?

ఈ వీధుల్లోనే తునాతునకులుగా పగిలిన నా ఆత్మ రేణువులను చెల్లాచెదురుగా పారవైచితిని. అసంఖ్యాకమైన నా కోర్కెల సంతానం ఈ పర్వత పానువుల్లో నగ్నంగా నడిచియున్నారు. బాధల బరువు లేకుండా వారిని విడిచి వెళ్ళలేను. ఈ రోజు నేను చించివేస్తున్నది నా దుస్తుల పీలిక కాదు. నా స్వహస్తాలతోనే నా చర్మమును ఒలిచి వేస్తున్నాను. ఆకలి దప్పికలతో అత్యంత మధురంగా మార్చిన నా హృదయాన్ని నా వెనుక విడిచి పోతున్నాను అనేది ఒక ఆలోచన కాదు కదా!

ఇక నేను ఉపేక్షించలేను. అందరినీ తన దగ్గరకు రమ్మని పిలిచే సముద్రం రమ్మని ఆహ్వానిస్తుంది. నేను తప్పనిసరిగా తీరాన్ని చేరుకోవలె. వెళ్ళకుండా ఆగిపోవడం అంటే, రాత్రిపూట సలసల కాగు క్షణాలు శీతలీకరణం చెంది, స్ఫటికాలుగా మారి ముద్దగా మిగిలిపోవడమే. ఇక్కడయున్నవాటిని నేను సర్దుకొని తీసుకొని వెళ్ళగలనా? కాని ఎలా? నాలుకనుండి పెదవుల సహాయంతో విహరించిన మాట తనతో బాటుగా నాలుకను, పెదవులను తీసుకొని వెళ్ళగలదా? నీటి ఆవిరి ఒంటరిగానే

# జిబ్రాన్ మార్గం

అంతరిక్షాన విస్తరించవలె గదా! గూడును వదిలినట్లయితేనే గ్రద్ద ఆకాశాన ఆదిత్యుని వరకు ఎగురగలదు గదా!

కొండ దిగి పర్వతపాదం చేరిన వెంటనే అతడు సముద్రం వైపు నడక ప్రారంభించాడు. తీరాన్ని చేరబోతున్న నౌకను చూసాడు. నౌక ముందుభాగాన ఉన్న నావికులను, తన ప్రాంతవాసులను చూసి తన ఆత్మ రోదించడం ప్రారంభించింది. వారితో అన్నాడు **"నా సనాతన మాతృ బిడ్డల్లారా! సముద్ర తరంగాలపై స్వారీ చేయు ధీరులారా!** నా స్వప్నాలలో ఎన్నిమార్లు మీరు విహరించి యున్నారు. నా అత్యంత ప్రీతిపాత్రమైన స్వప్నం సాకారమైనట్టు ఇప్పుడు నా ఎదుట వచ్చి యున్నారు. గాలితో పాటు సాగు తెరచాపలతో సయ్యాటలాడాలని నా లోని ఉత్సుకత ఉవ్విల్లూరుతుంది. నేను మీతో వచ్చుటకు సిద్ధం.

ఇదిగో ఒకే ఒక్క చివరి శ్వాస ఈ గాలిలో తీసుకొనుచున్నాను. ఇదే కడసారి చూపు నా ఊరివైపు చూస్తున్నాను. తదుపరి మీతో కలసి సముద్ర యాత్రికులతో పాటు ఒక సముద్ర యాత్రికునిగా కలవ బోతున్నాను. నదులకు, ప్రవాహాలకు స్వేచ్ఛ, ప్రశాంతతనొసగు నిద్ర అన్నదే ఎరుగని తల్లీ! ఓ విశాల సముద్రమా! ఇదిగో ఒకే ఒక్క మలుపు తిరుగుతున్నాను, ఈ నేలవైపు కడసారి గుసగుసలాడబోతున్నాను.

# జిబ్రాన్ మార్గం

ఆనక, అనంతమైన సముద్రంలో కలవబోయే అంతంలేని నీటి బిందువును నేను.” అని నడుస్తుండగా, దూరంనుండి నగరద్వారాలు దాటి, పొలాల్లో, ద్రాక్షతోటల్లో చేస్తున్న పనులు ఆపి అనేక మంది పురుషులు, స్త్రీలు తనవైపు రావడం చూసాడు. వారు తన పేరును పిలవడం విన్నాడు. వారు ఒకవైపు నుండి మరొక వైపు గట్టిగా అరుస్తూ తానున్న నౌక వద్దకు రాసాగారు.

తనలో తాను అనుకోసాగాడు. “వీడిపోతున్న ఈ రోజు ఒక పెద్ద సమావేశం కాబోతున్నదా? చేస్తున్న పొలం పని ఆపి వచ్చిన వానికి లేదా ద్రాక్ష రసం పిండు యంత్రం యొక్క చక్రం వీడి వచ్చినవానికి నేను ఏమి ఇవ్వగలను? నా హృదయం సమృద్ధిగా ఫలవంతమైన వృక్షం అయితే ఆ పండ్లు తెంపి వారికి ఇవ్వగలను. నా కోర్కెలు ఒక ప్రవాహమైనట్లు అయితే నేను వారి పాత్రలు నింపగలను. నేను ఒక వీణనో, వేణువో అయితే ఆ విశ్వంభరుడు తన చేతితోనో, తన శ్వాస తోనో వీరికి వీనులవిందు సంగీతం అందించగలడు.

నిశ్శబ్దాన్ని ఆస్వాదించే వాడిని నేను. నేను ఆ నిశ్శబ్దంలో పొందిన సంపద ఏమున్నది? వీరందరికీ నమ్మకంతో పంచిపెట్టగలను. ఇది నా

# జిబ్రాన్ మార్గం

పంట కోయు దినం అయితే నేను జ్ఞాపకం రాని కాలంలో ఏ విత్తనాలు విత్తి యున్నాను?

ఇది నా దీపం ఎత్తి చూపు సమయం అయితే అందులో మండుతున్న జ్వాల మాత్రం నాది కాదు. రిక్తంగా, చీకటిగా యున్న నా దీపాన్ని ఎత్తి ఉంచుతాను. ఆ నిశీదిరక్షకుడే దానిని నూనె తో నింపి, వత్తి వెలిగిస్తాడు."

ఈ మాటలు మాత్రమే అతడు పలికినాడు. అతని హృదయంలో అనేక మాటలు వ్యక్తపరచబడక ఉండిపోయినవి. అతని నిఘూడమైన రహస్యాన్ని అతను కూడా తెలియచేయలేక పోయాడు. అలా అతడు వారితో పాటు నగరానికి చేరుకోగానే ప్రజలందరూ అతనిని కలవడానికి వచ్చారు. వారంతా ముక్త కంఠం తో రోదిస్తున్నారు.

ఆ నగర పెద్దలు ముందుగా నిలబడి పలకసాగారు. "మా నుండి అప్పుడే నీవు దూరంగా వెళ్ళవద్దు. ఇంకా సంధ్య ముగియడానికి సమయం ఉన్నది. నీ యవ్వనం మాకు కలలు కనడానికి ఒక స్వప్నాన్ని ఇచ్చింది. మాలో నీవు అపరిచితుడవు కావు, అతిధివి కావు, మా కుమారుడవు, మా ప్రియాతి ప్రియమైనవాడవు. మాకు దూరమై మా

కనులకు బాధ కలిగించకు, నీ మోమునకు ఎవరూ లేరనే ఆకలి కలిగించకు”.

మతాధికారులు, మతాధికారిణులు అతనితో అన్నారు: ఈ సముద్ర తరంగాలు మా నుండి నిన్ను వేరు చేయుకుండు గాక! మాలో ఒకటిగా ఎన్నో ఏళ్లుగా జీవించిన నీ జీవితం ఒక జ్ఞాపకం గా మిగల కుండు గాక! మా లో ఒక ఆత్మగా నీవు నడిచియున్నవాడవు. నీ నీడయే మా మోములకు కాంతి యొసగినది.

మేమెంతగా నిన్ను ప్రేమించిననూ, మా ప్రేమ మూగది, ముసుగులోనే ముసుగువేసి అవ్యక్తముగా ఉండినది. ఇప్పుడు నీకొరకు హృదయం పగిలేలా రోదిస్తున్నది. నీ ముందు ముసుగు తొలగించుకొని నిలబడియున్నది. **విరహ సమయం ఆసన్నమైనంతవరకు ప్రేమ యొక్క గాఢత, లోతు ప్రేమకే తెలియదు.”**

అంతలో ఇతరులు వచ్చి వేడుకోసాగారు. కాని ఆయన జవాబు ఇవ్వలేదు. అతడు తన తల వంచి యున్నాడు. అతనికి దగ్గరలో ఉన్నవారికి అతని కనుల నుండి కన్నీరు అతని వక్షస్థలం పై జాలవారడం

గమనించారు. అతను, మిగిలినవారు దేవాలయం ముందున్న వాకిలి వద్దకు చేరుకున్నారు.

ఆ దేవాలయానికి ఆనుకున్న ఆశ్రమం నుండి **'అల్ మిత్రా'** అను పేరు గల స్త్రీ వచ్చినది. ఆమె ఒక సన్యాసిని.. అతడు ఆమెను విస్తృతమవుతున్న సౌమ్యంతో చూసాడు. అతను ఈ నగరానికి వచ్చిన మొదటిరోజే అతనిని నమ్మిన మొదటి వ్యక్తి.

ఆమె అతనిని స్తుతించుట మొదలిడినది..." **ఓ భగవంతుని స్వరమును వినిపించు ఒ ప్రవక్తా!** అత్యున్నత స్థానాన్ని కోరుకునేందుకు గాను, నీవు నీ నౌక ను ఎన్నో ఏళ్లుగా అన్వేషించుచున్నావు. ఇప్పుడు నీ నౌక తీరానికి చేరుకున్నది. నీవు వెళ్ళడం తప్పనిసరి. నీ గొప్ప కోరికలు నివసించు ఆ స్థలమునకు, నీ జ్ఞాపకాలు ముడిపడియున్న ఆ ప్రదేశం పట్ల నీకు గల మక్కువ అత్యంత గాఢమైనది. మా అవసరాలు నిన్ను బంధించవు, మా ప్రేమ నిన్ను నిలుపుదల చేయదు.

నీవు మమ్మల్ని విడిచి వెళ్ళేముందు నీవు శోధించి కనుగొనిన సత్యం గురించి మాతో మాట్లాడు. దానిని మేము మా పిల్లలకు అందిస్తాము. వారు తమ పిల్లలకి అందిస్తారు. అది ఎన్నటికీ నశించిపోదు.

# జిబ్రాన్ మార్గం

నీ ఏకాంత జీవనంలో పగటిపూట మమ్మల్ని అధ్యయనం చేసి యున్నావు, నీ జాగురుకత తో నిద్రాణ స్థితిలో ఉన్న మా సంతోషాలను, రోదనలను వినియున్నవాడవు. కాబట్టి మా గురించి మాకు ఇప్పుడు ఎరుకపరచు. చావుకు పుట్టుకకు మధ్య నీకు కనబడినది మాకు తెలియపరచు."

అపుడు అతడు సమాధానమిచ్చాడు. "**ఓ ఆర్ఫలీజు నగర వాసులారా!** నేను మీ మనస్సులలో లేనిదేదీ మాట్లాడలేను. ఇప్పటికీ మీ ఆత్మలలో ఇప్పటికీ చలిస్తున్న విషయాలే చెప్పగలను."

**1. ప్రేమ గురించి**

అపుడు **అల్ మిత్ర ..... 'ప్రేమ'** గురించి తమకు చెప్పమని అడిగింది......

అపుడు అతడు తలయెత్తి అందరి వైపు చూసాడు...

అందరిలో ఒక నిశ్చలస్థితి ఆవహించగా

అతడు మహోన్నత స్వరంతో పలికాడు;

ప్రేమ నిండు మనస్సుతో చేతులెత్తి

మిమ్మల్ని ఆహ్వానిస్తే,

దాని మార్గం ఎంతటి పదునైనది, క్లిష్టతరమైనది

# జిబ్రాన్ మార్గం

అయినప్పటికీ దానిని అనుసరించండి..

దాని రెక్కలు విచ్చుకొనగా

అందులో మృదువైన ఫించముల నడుమ

నిఘూడంగా ఉన్న విచ్చుకున్న కత్తులు

గాయపరచే అవకాశామున్ననూ

దాని రెక్కలనడుమ పోదిగిపొండి....

ఉత్తరపు ఉధృతగాలులు

ఉద్యానవనాలను చిందరవందర చేసేవిధంగా

ప్రేమ యొక్క స్వరం ఉన్నప్పటికీ

దాని మాటలు నమ్మండి.

ప్రేమ మీకు కిరీటాన్ని ధరింప చేసినప్పటికీ,

శిలువకొయ్యపై నిలుపవచ్చును.

ప్రేమ మీ ఉన్నతికి సహాయపడేటప్పటికీ,

మీ పెరుగుదలను క్రమబద్దీకరింప చేయవచ్చును.

ప్రేమ మీ ఉన్నతికి ప్రాకి,

సూర్యకిరణాల వెచ్చదనంతో పెరుగుదలకు దోహదపడే

శిఖరాగ్ర మొగ్గలను సున్నితంగా సాకే టప్పటికీ,

# జిబ్రాన్ మార్గం

మీ స్థిరత్వానికి కారణమయ్యే

ధృఢముగా ఉన్న మూలాల లోతుల్లోకి అవరోహిస్తూ,

వాటిని పెకలింప వేయవచ్చును.

మొక్కజొన్న చేల నుండి కంకులను వేరు పరచి,

వాటినుండి గింజలను పెకిలించి,

వాటిని బాగుగా ఎండబెట్టి , పిండిగా మార్చి,

మృదువైన ముద్దగా కలియబెట్టి,

రొట్టెగా కాల్చి నట్టు

నిన్ను కూడా ప్రేమ పలు విధాలుగా మార్చి, కాల్చి

భగవంతుని విందు భోజనమునకై

నైవేద్యంగా మార్చుతుంది...

నీ హృదయ రహస్యాలను నీవు తెలుసుకొని,

ఆ జ్ఞానంతో జీవితపు హృదయంలో

ఒక అణువుగా మారేందుకు గాను

ప్రేమ నీపై ఇలాంటి ప్రభావాన్ని చూపుతుంది.

కాని ప్రేమ పట్ల భయంతో ఇలా కాకుండా

కేవలం ప్రేమ యొక్క ప్రశాంతతను,

# జిబ్రాన్ మార్గం

ఆనందంను  మాత్రమే వాంఛించినట్లయితే,

నీ దిగంబరతకు ముసుగులు వేసి,

ప్రేమ అనే రోకలిబండ నుండి దూరంగా జరిగి,

నీ నవ్వు నీవు నవ్వలేని,

నీ కన్నీటిని వ్యక్తపరచలేని,

దు:ఖాన్ని నిండిన కృత్రిమ ప్రపంచం లోకి నడచిపో.

ప్రేమ ఇచ్చేది ప్రేమనే తప్ప

ఇంకా విలువైనదేది  ఇవ్వదు,

అలాగే ప్రేమ తీసుకునేది కూడా ప్రేమనే తప్ప

ఏ ఇతర విలువైనేదేదీ కాదు.

ప్రేమకు ప్రేమయే సరిపాటి కావున

అది దేనీని బందించదు లేదా బంధించబడదు.

నీవు ప్రేమిస్తున్నట్లయితే

దేవుడు నా హృదయంలో ఉన్నాడు అని అనరాదు...

నేనే దేవుని హృదయమందు ఉన్నాను అనవలె....

ప్రేమకు మార్గదర్శకం చేయగలనని తలచరాదు,,

నీవు తగినవాడివవి భావిస్తే

# జిబ్రాన్ మార్గం

ప్రేమయే నీకు మార్గదర్శకం చేస్తుంది.

తనను తాను సంపూర్ణం చేసుకోవడమే తప్ప

ప్రేమకు ఇతర కోరికలుండవు.

కాని నీవు ఒకవేళ ప్రేమిస్తే,

కోరికలు కలిగి యుంటావు.

నీ కోరికలను నీ కోరికలు గానే ఉండనీయి..

వాటిలో కరిగి నిశీధి రాత్రిలో

రాగయుక్తంగా ప్రవహించే కొండవాగులా కదలిపో.

ప్రేమను అర్థం చేసుకునేందుకు గాను

గాయపడుటకు గాను,

సంతోషంగా, ఇచ్చాపూర్వకంగా

రుధిరాన్ని స్రవించేందుకు గాను,

బాధను తెలుసుకునేదుకు వీలుగా

అత్యంత సున్నితంగా ఉండు.

ప్రేమించుటకు మరో రోజు లభించింది అనే కృతజ్ఞత తో

నీ హృదయానికి రెక్కలు తొడుక్కొని మేల్కో....

ప్రేమయొక్క తన్మయత్వాన్ని

ధ్యానించేందుకు గాను

మధ్యాహ్నం విశ్రాంతి తీసుకో..

సాయంత్రం వేళ కృతజ్ఞతలు తెలిపేందుకు

నీ గృహాన్ని చేరుకో..

నిదురపోవు సమయంలో

నీవు ప్రేమించేవారికోసం హృదయంలో ప్రార్ధన చేస్తూ

నీ పెదవులతో  అభినందన గీతం పాడుతూ నిదురపో...

## 2. వివాహం గురించి

తదుపరి అల్ మిత్ర మరలా అడిగింది..

'**వివాహం**' గురించి మాట్లాడమని..

దానికి సమాదానమిచ్చాడు:

భార్యాభర్త ఇద్దరు కలిసే పుడతారు,

కలిసే ఎప్పటికీ ఉంటారు.

శ్వేత రెక్కలు దాల్చిన మృత్యుదేవత

వారి జీవితాన్ని చిన్నాభిన్నం చేసినా కలిసే ఉంటారు.

# జిబ్రాన్ మార్గం

భగవంతుని నిశ్శబ్దపు జ్ఞాపకాల పొరలలో

సైతం ఇద్దరు కలిసే ఉంటారు.

కాని ఇద్దరి సాన్నిహిత్యం లో సైతం

కొంత  అంతరం ఉంటుంది,

ఆ జాగాలో స్వర్గపు పవనాలు నాట్యమాడుతుంటాయి.

ఇద్దరూ ఒకరినొకరు ప్రేమించుకోవాలి

కాని ప్రేమ బంధం కారాదు.

వారి ఆత్మల తీరాల నడుమ

చంచలించే సాగరం సయ్యటలాడుతుంది.

ఇరువురి పాత్రలలో పానీయమున్నప్పటికీ

రెండు పాత్రలను  ఇరువురూ సేవించాలి.

ఇద్దరి చేతుల్లో ఉన్న  రొట్టెలను

పరస్పరం మార్చుకున్నప్పటికీ

ఒకే ముక్కను కలిసి తినరాదు.

వీణలోని తంత్రులు వేరు వేరుగా ఉన్నప్పటికీ

ఒకే రాగానికి, శ్రుతికి అనుగుణంగా స్పందించేటట్లు,

ఎవరి ఏకాంతాన్ని గడుపుతూనే

# జిబ్రాన్ మార్గం

కలసి ఆడుతూ, పాడుతూ ఆనందించాలి.

జీవిత కబంధ హస్తాల్లో

ఇరువరి హృదయాలు పొందుపరచబడతాయి

కాబట్టి  ఎవరి ఆధీనంలో హృదయాలను

బందీగా ఉంచకుండా ఇచ్చుకోవాలి.

ఆలయ మండపం యొక్క  స్తంభాలవలె

మరీ అతి చేరువ కాకుండా కలసి యుండాలి.

రెండు మహావృక్షాలు ఒకరి నీడలో మరొకటి పెరగలేవు గదా!

**3. పిల్లల గురించి**

తన పొత్తిళ్ళలో ఒక పసిపాపను పొదివి పుచ్చుకున్న

ఒక తల్లి అడిగింది '**పిల్లల**' గురించి మాట్లాడమని....

అతను చెప్పడం మొదలు పెట్టాడు ....

మీ పిల్లలు మీ పిల్లలు కారు  ..

తాము ఇష్టపడే తమదైన జీవితానికి పిల్లలు వారు.

మీ ద్వారా ఈ భూమి మీదకి వచ్చారే  గాని

# జిబ్రాన్ మార్గం

మీ నుండి మాత్రం కాదు.

వారు  మీతో ఉండి ఉండవచ్చునేమో గాని

వారు మీకు చెందరు.

మీరు మీ ప్రేమను వారికి ఇవ్వవచ్చునేమో గాని,

మీ ఆలోచనలను వారికి ఇవ్వలేరు

ఎందుకంటే వారికి తమదైన ఆలోచనలుంటాయి.

మీరు మీ కలలో కుడా దర్శించలేని

భావి సౌధాలాలో వారి ఆత్మలు నివసిస్తుంటాయి

కాబట్టి మీరు కేవలం వారి శరీరాలకే చోటివ్వగలరు

కాని  వారి ఆత్మలకు కాదు.

మీరు వారి లాగ ఉండటానికి

శ్రమించవచ్చునేమో గాని,

వారిని మీలా తయారు చేయాలని కోరుకుంటే,

జీవితాన్ని వెనక్కి మరల్చడానికి

యత్నించడం వంటిదే..

మీ పిల్లలు అనబడే బాణాలు

సంధించబడ్డ ధనుస్సులు మీరు.

# జిబ్రాన్ మార్గం

అనంతం అనే మార్గంలోగల

లక్ష్యానికి గురి పెట్టిన విలుకాడు

తన బాణాలు సుదూరంగా, జుమ్మని చేరుకోవాలని

ధనుస్సుని బాగుగా వంచుతాడు.

తన చేతిలో స్థిరంగా ఉండే ధనుస్సుని,

లక్ష్యాన్ని చేదించేందుకు పయనించే బాణాన్ని

రెండింటిని సమానంగా ప్రేమించే

ఆ విలుకాడి చేతిలో ఆనందంగా

ఒదిగిపోవడమే....వంగిపోవడమే.......

## 4. దానం గురించి

అపుడు ఒక ధనికుడు '**దానం**' గురించి మాట్లాడమన్నాడు.

దానికి ఇలా జవాబివ్వడం మొదలుపెట్టాడు,,,

నీ వద్దనున్న ఆస్తిపాస్తులను ఇతరులకు ఇచ్చుట

అతి కొద్దిపాటి దానమే,

కాని మిమ్మల్ని మీరు

సమర్పించు కొనుటయే నిజమైన దానం.

# జిబ్రాన్ మార్గం

రేపటికి  అవసరపడతాయనే భయంతో

ఆస్తిపాస్తులు సముపార్జిస్తూ,

సంరక్షించుకుంటారు కొందరు.

తీర్థయాత్రలకు పోవు వారి వెంట నడిచే

అతి జాగ్రత్తపరురాలైన కుక్క

తన తదుపరి అవసరాలకోసం

గోతిలో ఎముకలు  దాచుకున్నట్లయితే ,

దానికి అవి ఉపయోగపడగలవా?

అవసరం అనే భయం కన్నా అవసరం ఉంటుందా?

నిండుగా ఉన్న నీరు ఉన్న నూతులున్నప్పటికీ

దాహం కోసం భయం ఉంటుందా?

ఆ దాహం తీర్చలేనంత దాహమా?

తమకున్నంతలో అతి తక్కువ ఇచ్చి

అతి ఎక్కువ ఇచ్చినట్టుగా  గుర్తింపు పొందాలనే

గుప్త కోరికలు కలిగినవారుంటారు. **కొందరు**..

అతి తక్కువ కలిగియున్నప్పటికీ

తమ ఖజానా ఎన్నటికీ తరగదు అనే భావనతో

# జిబ్రాన్ మార్గం

తక్కువ ఉన్నా ఎక్కువ ఇచ్చేవారుంటారు.... **కొందరు**..

ఇవ్వడంలో ఉన్న ఆనందం కొరకు ఇచ్చేవారుంటారు. **కొందరు**

ఆ ఆనందమే వారి పెద్ద బహుమానం.

బాధ పడుతూ ఇచ్చేవారు  ఉంటారు.. **కొందరు**..

ఆ బాధయే వారికి మోక్షం.

ఏ బాధ లేకుండా, ఆనందం కోసం కాకుండా,

దానమివ్వడం గొప్ప పని అనే భావన లేకుండా

దానం చేస్తుంటారు.,, **కొందరు**..

వారు ఒక అందమైన లోయల్లో ఉన్న

పూదోటలు తమ సువాసనలను

విశాలమైన ప్రపంచంలోకి

ఏమీ ఆశించకుండా వెదజల్లుతున్నట్టు

సహజంగా దానం చేస్తుంటారు.

అటువంటి దానం చేసేవారి హస్తాలద్వారా

ఆ పరమాత్ముని స్వరం పలుకుతుంది.

వారి కళ్ళనుండి యీ ప్రపంచంవైపు

ఆ పరమాత్మ చిరునవ్వు చిలకరిస్తుంటాడు.

# జిబ్రాన్ మార్గం

ఆడిగినప్పుడు ఇవ్వడం మంచిదే,

కాని అర్థం చేసుకొని,

అడగకుండా ఇవ్వడం ఇంకా మంచిది.

అవసరం ఉన్నవారెవరో అని అన్వేషించి

వారికి చేతుల తెరచి ఇచ్చినట్లయితే,

దానిని స్వీకరించిన వారి ఆనందం

ఇచ్చినవారి ఆనందం కన్నా మహోన్నతంగా ఉంటుంది.

నీవు  ప్రస్తుతం కలిగియున్నదంతా

నీతోనే ఉంటుందనుకుంటున్నావా?

నీ వద్ద ఉన్నదంతా

ఏదో ఒకరోజు ఇచ్చివేయవలసి వస్తుంది.

కాబట్టి ఇప్పుడే ఇచ్చివేయు..

నీ వారసుల చేతుల మీదుగా ఇవ్వడం కన్నా,

నీ చేతుల ద్వారా ఇవ్వబడటం మంచిది..

అర్హుడైనవానికే ఇస్తానని నీవనుకోవచ్చు...

నీ తోటలో ఉన్న చెట్లు,

విశాల గగనంలో విహరించే పక్షులు

# జిబ్రాన్ మార్గం

నీలా అనుకోలేదు గదా!

బ్రతికి ఉన్నంతవరకు ఇవ్వడమే వాటి పని..

వాటి దృష్టిలో దాచి పెట్టుకోవడమంటే  నశింపచేయడమే....

ఈ రేయిని, పగటిని పొందుటకు అర్హుడైన ప్రతి ఒక్కడూ

నీ సహాయం పొందుటకు అర్హుడే.

విశాల జీవనసాగరం నుండి ఆస్వాదించే ప్రతి వాడికి

నీ చిన్న నీటి చెలమ నుండి ఒక తన పాత్రను

నింపుకొనుటకు అర్హుడే.

ఒకరు ఇచ్చిన దానిని స్వీకరించుటకు

వారు చూపే ధైర్యం, విశ్వాసము కన్నా

గొప్ప అర్హత ఏమై ఉండగలదు?

వారి ఆత్మవిశ్వాసం సమర్పించుకొని,

ఆత్మాభిమానం విడిచిపెట్టి,

వారి అతిశయాన్ని నగ్నపరచి

మీ  దానం  స్వీకరించుటకు

# జిబ్రాన్ మార్గం

మీ ముందు సాగిలబడేటంత

అర్హత కలిగినవారా మీరు?

కావున దానమిచ్చుటకు .

మీ ద్వారా దానం చేయుబడుటకు

తగిన అర్హత కలిగి యున్నవారా మీరు?

అని మిమ్మల్ని మీరు పరికించుకొనుడు.

సత్యమేమిటంటే

జీవితమే మరో జీవితానికి దానమిస్తుంది.

దాతగా భావించబడే నీవు కేవలం సాక్షివి మాత్రమే.

గ్రహీతగా  భావించబడే మీరు గ్రహీతలు మాత్రమె.

కృతజ్ఞతాభారం మీద వేసుకోనవద్దు.

ఒకే రాటకు చెరో వైపు మీరివ్వురుని కట్టుకోవద్దు.

గ్రహించిన బహుమానాలను రెక్కలుగా మార్చుకొని

ఉన్నతి వైపు విహరించండి...

ఋణభారం గురించి అధికంగా ఆలోచించుట

ఉదార హృదయులైన పుడమిని, పరమాత్మని

తల్లిదండ్రులు గా కలిగిన దాత యొక్క

ధాతృత్వాన్ని శంకించుటయే..

**5. తినుట – త్రాగుట గురించి**

ఒక సత్రం ముందు కాపలా ఉండే ఒక ముదుసలి

‘**తినుట, త్రాగుట**’ గురించి మాట్లడమనగా , అతడు చెప్పాడు:

మీరు మొక్కల వలె భూమి మట్టి పరిమళాన్ని,

గాలిని, సూర్యరశ్మిని వినియోగిస్తూ

ఆహారం తయారుచేసుకుంటూ

బ్రతుకుతుంటే ఎంత బాగుండేది?

కాని మీరు మీ తిండికోసమై,

ఇతర జీవులను వధిస్తూ,

దాహార్తి తీర్చుకొనుటకు

లేదూడ త్రాగాల్సిన పాలను దొంగిలిస్తూ,

బ్రతకడం తప్పని సరి అయినప్పుడు,

అది ఒక దైవకార్యమైనట్టు సాగించండి.

# జిబ్రాన్ మార్గం

మీ భోజనశాలను ఒక పవిత్రమైన వేదికగా మార్చి

ఆ అమాయకంగా స్వేచ్ఛగా, స్వచ్ఛంగా అడవులలో,

మైదానాలలో పెరిగే వాటిని బలి ఇస్తూ

మీ పవిత్రతను, అమాయకత్వాన్ని అలాగే కాపాడుకోండి..

మీరు ఆహారం కొరకు ఒక జీవిని చంపునపుడు,

మీ మనస్సులో తలచుకోండి

" ఏ అధమ శక్తికి ఈ జీవి నాచేతిలో

బలియై, ఆహారమవుతుందో.

అదే శక్తికి నేను కూడా బలియై,

ఆహారంగా వినియోగించబడతాను..

ఏ శాసనమైతే నిన్ను చంపుటకు

నాకు అవకాశమిచ్చిందో

అదే శాసనం మరో బలమైన శక్తికి

నన్ను కూడా అప్పచెబుతుంది.

స్వర్గలోకపు వృక్షం కొరకు నీ రక్తం, నా రక్తం

ఎరువులుగా వాడబడవు గదా!"

నీ పంటితో ఒక పండును కొరుకునపుడు

# జిబ్రాన్ మార్గం

నీ మనస్సులో దానితో చెప్పు ..

" నీ విత్తనాలు నా శరీరంలో పెరుగును,

నీ మొగ్గలు నా హృదయమందు వికసించును,

నీ సువాసన నా శ్వాసలో కలుయును ,

అన్ని ఋతువులను మనిద్దరం ఆనందిద్దాము."

శిశిర కాలమందు ద్రాక్ష తోటలనుండి

పండ్లను సేకరించి మధువు తయారుచేయుటకు

వాటిని పిండుతున్నపుడు,

వాటితో మీ మనస్సులో చెప్పండి.

" నేను కూడా ఒక ద్రాక్షతోట వంటి వాడినే,

మధువు తయారుచేయుట కొరకు

నన్ను కూడా సేకరించి,

రసంగా పిండి, అనంతమైన భాండములలో

నిలువ చేయబడతాను."

చలికాలం నందు నిలువ చేయబడిన

మధువును పైకి తీయునపుడు

నీవు సేవించే ప్రతీ పాత్ర కొరకు

నీ హృదయం పాడవలెను.

ఆ పాట యందు శిశిర కాలం గురించి,

ఆ తోటల  గురించి,

నలపబడిన ద్రాక్ష పండ్లను స్మరణ ఉండవలెను.

**6. శ్రమ గురించి**

అపుడొక కర్షకుడు '**శ్రమ**' గురించి మాట్లాడమనగా,

అతడు పలికె.....

" మీరు యీ జగత్తు యొక్క ఆత్మ తో

లయం అయ్యేందుకు గాను,

దాని వేగాన్ని అందుకునేందుకు గాను

మీరు శ్రమిస్తారు.

పనీపాట లేక సోమరిగా ఉండుట,

ఋతువుల రాకపోక  తెలియకుండుట,

అనంతం వైపు అత్యంత గౌరవపూర్వకమైన

ఆత్మ సమర్పణ కై సాగుతున్న

# జిబ్రాన్ మార్గం

జీవన కవాతు నుండి పైదొలుగుటయే.....

మీరు శ్రమించేటపుడు మీరొక  వేణువు గా మారి,

మీ హృదయస్పందన లో

కాలం యొక్క  గుసగుసలు

సుమధుర గానంగా మారిపోవును.

అందరూ బృందగానంలో

ఏక శ్రుతిలో నిమగ్నులు కాగా,

ఏమీ పట్టనట్టు మౌనంగా, మూగగా,

వెదురుబొంగులా మీలో ఎవరు ఉండగలరు?

శ్రమ అనేది ఒక శాపమని,

శ్రమించుట ఒక దురదృష్టమని

మీరంతా చెప్పబడి యున్నారు.

మీరు శ్రమిస్తున్నారు అంటే

యీ పుడమితల్లి  మహోన్నత  భావి స్వప్నాన్ని

సాకారంచేయు చేయబోతున్నారని!

ఆ స్వప్నం పుట్టినప్పుడే

మీకు ఈ పని ఇవ్వబడటం జరిగిందని!

# జిబ్రాన్ మార్గం

మీరు శ్రమిస్తున్నారు అంటే

జీవితాని ప్రేమించే సత్యం తో

అనుసంధానమయ్యారని,

శ్రమించడం ద్వారా జీవితాన్ని ప్రేమించడం అంటే

జీవిత అంతర్గత రహస్యంతో

మమేకం అయ్యారని....

ఒక్కోసారి మనసు లోని బాధ మెలిపెట్టగా

మానవ జన్మ అనేక కష్టాలతో, బాధలతో కూడియున్నదని,

నుదుటిరాత బట్టి జీవితం

సాగుతుందని పలుకుతుంటారు.

నేను ఇదే చెబుతున్నాను ......

మీరు చిందించే స్వేదంతో

మీ నుదుటిరాత సైతం చెరిగిపోగలదని...

బ్రతుకంతా అంధకార బంధురమని,

బాధలతో కూడియున్నదని,

మీరు బాధలనుభవించేవారి చేత చెప్పబడ్డారు

కాబట్టి వారి బాధలనే మీరు ప్రతిధ్వనిస్తుంటారు.....

# జిబ్రాన్ మార్గం

నేను ఇదే చెబుతున్నాను.........

నిజమే. జీవితం అంధకారబంధురమే...

**తపనే లేకపోతే** !

తపించడం కూడా అంధత్వమే..

**జ్ఞానమే లేకపోతే**..!

జ్ఞానం కూడా వృథానే...

**శ్రమించడమే లేకపోతే**..!

శ్రమించడం కూడా శూన్యమే..

**ప్రేమే లేకపోతే**...!

ఎప్పుడైతే ప్రేమిస్తూ పనిచేస్తుంటామో

నీతో నీవు అనుసంధానమౌతావు...

ఇతరులతో అనుసంధానమౌతావు,

ఒకరితో ఒకరు గా చివరికి

ఆ పరమాత్మతో అనుసంధానమౌతావు...

ప్రేమస్తూ పని చేయడమంటే ఏమిటి?

నీవు ప్రేమించే వ్యక్తి ధరిస్తాడు అని భావిస్తూ

నీ హృదయతంత్రుల నుండి తీసిన

# జిబ్రాన్ మార్గం

దారంతో బట్టలు నేయడం...

నీవు వలచిన వ్యక్తి  నివసించబోవుననే భావంతో

ఇంటిని నిర్మించడం ...

నీ ప్రియతములే భుజించ బోవుననే భావం తో

మృదువుగా విత్తనములు విత్తి,

సంతోషంతో పంటను కోయడం...

నీ ఆత్మనుండి వెలువడు శ్వాసను నింపి,

నీవు సమ్మోహంతో  చేయుపనులలో

కొత్త ఉత్తేజం నింపటం,

నీ పూర్వీకులు స్వర్గలోకంనుండి

నీవు చేయుపనులను వీక్షిస్తూ,

నిన్ను ఆశీర్వదిస్తున్నారని

తెలుసుకొని పనిచేయడం.....

నిద్రమత్తులో పలికే విధంగా

మీరందరు అనే మాటలను నేను విన్నాను...

పాలరాతి శిల్పాలను

తన తన ఆత్మ లోని భావాలకు

# జిబ్రాన్ మార్గం

ప్రతిరూపంగా చెక్కే శిల్పి,

మట్టిని  దున్ని సేద్యం చేయువాని కన్నా మిన్న యని,

మానవ అభిరుచులకు అనుగుణంగా

ఇంద్ర ధనుస్సు లోని వర్ణాలను

వస్త్రాలపై  అద్దే నేతవాడు ,

మన పాదాలకు పాదరక్షలు కుట్టే వాని కన్నా మిన్న అని .....

కాని  ఇదే చెబుతున్నాను నేను

నిద్ర మత్తులో కాదు,

మధ్యాహ్నపు సెగ  ప్రేరేపించిన

పూర్తి మెళుకువ తో పలుకుతున్నాను..

పుడమి పాదాలచెంత  పొర్లే  ప్రతి గడ్డి పోచ పై

మధురమైన స్వరంతో విహరించే పవన మారుతం

ఎత్తైన వృక్షాలపై కూడా ఒకే విధంగా విహరిస్తుంది... అని..

తన మధురమైన ప్రణయభావంతో

గాలి లోని స్వరాన్నిరాగయుక్త పాట గా

మార్చగలిగే వ్యక్తి

ముమ్మాటికీ  మహోన్నతుడు... అని.

# జిబ్రాన్ మార్గం

శ్రమ అనేది గోచరంబయ్యే ప్రేమ ..

నీవు ప్రేమిస్తూ పనిచేయచేయలేక,

అయిష్టంగా పనిచేస్తుంటే,

తక్షణమే ఆ పనిని  విడిచిపెట్టి,

దేవాలయపు గుమ్మం వద్ద కూర్చొని,

ప్రేమిస్తూ పనిచేసే వారివద్ద భిక్షమెత్తుకొనుట మంచిది.......

ఏలననగా... మొక్కుబడిగా మీరు వండిన వంట,

రుచిని కోల్పోవడమే కాక

తినేవారి అర్ధాకలిని కూడా తీర్చలేదు.

ప్రతీకారభావన మనసులో ఉంచుకొని

పండ్లను చిదిమి చేసిన పళ్ళరసం

విషం తో సమ్మిళితమై ఉంటుంది.

గంధర్వుల వలె గానం చేయగల

నేర్పు ఉన్నప్పటికీ

పాడటం లో  ప్రేమ లోపిస్తూ  మీరు చేసే గానం,

సహజ శబ్దాలను కూడా వినలేని

శాశ్వత బధిరులను చేస్తుంది...

## 7. సుఖ దు:ఖాల గురించి

అంతలో ఒక  మహిళ ‘ **సుఖదు:ఖాల**’ గురించి మాట్లాడమని కోరింది.

అతను చెప్పడం మొదలు పెట్టాడు;

దుఖం యొక్క ముసుగును తొలగించితే

కనబడేదే  ఆనందం.

తరచూ  మీరు  కన్నీళ్ళతో నింపుతూ ఉండే

బావి నుండి ఉబికి వచ్చిన ఊటయే మీ ఆనందం.

ఇది కాక మరేమీ కాగలదు?

దుఖం నీ ఆకృతిని

ఎంత లోతుగా చెక్కితే

అంత అధికంగా నీవు ఆనందాన్ని కలిగియుంటావు..

ఇప్పుడు నీ చేతిలో మధురపానీయాన్ని

కలిగియున్న పాత్ర,

ఒకప్పుడు కుమ్మరి కొలిమిలో

ఎంతగానో కాలియున్నదే కదా!

మధురాతి గానంతో

# జిబ్రాన్ మార్గం

మనస్సుకు హాయిని కలిగించే వేణువు,

తయారైనపుడు  నిలువెల్లా రంధ్రాలు చేయుబడుటకు

ఎన్నో కత్తి గాట్లు తిన్నదే గదా!

నీవు ఆనందంలో ఉన్నప్పుడు,

నీ హృదయాన్ని లోతుగా తడిమిచూస్తే

ఏదో ఒక గాయం ఈ ఆనందానికి

కారణమై ఉంటుందని గ్రహించగలవు.

నీవు బాధల్లో ఉన్నప్పుడు

నీ హృదయాన్ని బాగా పరిశీలించి

తెలుసుకునే సత్యం ఏమిటంటే

నేటి నీ రోదనకు కారణం ఒకప్పుడు

నీకు  ఆనందం కలిగించిన విషయమే అని....

కొంత మంది సుఖమే దుఖం కన్నా గొప్పదని,

మరికొందరు అలా కాదు

దు:ఖమే సుఖం కన్నా గొప్పదని అంటుంటారు.

ఆ రెండు విడదీయరానవని నేను చెబుతున్నాను.

# జిబ్రాన్ మార్గం

రెండు నీ వద్దకు కలిసే వస్తాయి.

ఒకటి నీ చెంతనే ఉన్నపుడు

రెండవది నీ మంచంపై నిద్రితమై ఉంటుంది.

వాస్తవానికి ఆ రెండింటి మధ్య లోలకం వలె

నీవే కదలాడుతుంటావు.

నీవెప్పుడైతే నిశ్చలంగా, సమతౌల్యంతో ఉంటావో

సుఖ, దు:ఖరహితుడవు కాగలవు.

సుఖ దు:ఖ  భావన ఎంతటి అవిభాజ్యమంటే

తుదకు  మహైశ్వర్యాధిపతి ఆయన భగవంతుడు

తన  వెండి, బంగారు రాశులు  తూచుటకు

నిన్ను పైకి తీసుకుపోవు సమయం లోన సైతం

ఈ సుఖ, దుఖాలు వేరు చెందక

క్రిందా మీదా తైతక్కలాడుట తథ్యం.

# జిబ్రాన్ మార్గం

## 8. ఇల్లు గురించి

అంతలో ఒక మేస్త్రీ ముందుకు వచ్చి '**ఇల్లు**' గురించి

తమతో మాట్లాడమని అడిగాడు. దానికి అతను ఇలా చెప్పాడు....

నిర్మానుష్య ప్రాంతంలో తలదాచుకునేందుకు

సహాయపడే పందిరి మాదిరి

నీవు కూడా నీ ఊహలకు తగ్గట్టుగా

నగర పరిధికి లోబడి ఇల్లు నిర్మించుకొనెదవు.

ప్రతీ సాయంత్రం ఆ ఇంటికి

నీవు చేరుకుంటావేమో గాని

నీలో అంతర్గతంగా ఉండే దేశ ద్రిమ్మరి

ఎల్లప్పుడూ సుదూరంగానే , ఒంటరిగానే ఉంటాడు.

నీ ఇల్లు కూడా నీ శరీరం వంటిదే.

పగటి పూట సూర్యకాంతి లో శ్రమిస్తూ,

నిశీధి నిశ్చల స్థితిలో విశ్రమిస్తుంది.

దానికి స్వప్నాలు ఉండవూ?.. ఎందుకు ఉండవు ..

ఈ నగర వీధులను వీడి,

# జిబ్రాన్ మార్గం

తోటలలో, కొండ శిఖరాలో

స్వప్న విహారం చేస్తుంది

మీ ఇళ్ళను అన్నింటినీ

రెండు దోసిళ్ళలో తీసుకొనే శక్తి నాకుంటే,

వాటిని విత్తనాలు చల్లే విధంగా

అడవిలో, పచ్చిక బయళ్ళలో విసిరేసే వాడిని.

ఈ లోయలే మీ  రహదారులు,

పచ్చిక బయల్లే  మీ వీధులు,

ద్రాక్షతోటల మధ్య.

మట్టి పరిమళం అంటిన  దుస్తులతో సంచరించేవారు.

కాని ఇది ఇప్పటికి సాధ్యం కాదు,

భయం ప్రేరేపించడం వలన

మీ తాత,ముత్తాతలు

ఒకరికొకరు అతి సమీపంలో

నివసించేటట్టుగా  గృహాలను ఏర్పరచారు,

ఈ భయం ఇంకా కొన్నేళ్ళు కొనసాగు గాక.

మీ పొలాలను , మీరు నివసించే ప్రదేశాలను

# జిబ్రాన్ మార్గం

నగర గోడలు ఇంకా దూరంగానే ఉంచుతాయి.

**ఓ ఆర్ఫలీజు నగరవాసులారా!**

చెప్పండి, మీ ఇళ్ళలో ఏముంది?

తలుపులు బిగబెట్టి

మీరు మీ ఇళ్ళలో దాస్తున్నది ఏమిటి?

మీకు ప్రశాంతత ఉన్నదా?

మీ శక్తులను వ్యక్తపరచు నిశ్చల ఉద్వేగమున్నదా?

మీ మనో శిఖరాలలో

జిగేల్ మంటూ వెలుగుతుండే

మీ ఇంటి పై కప్పులలో

మీ జ్ఞాపకాల సడి ఉన్నదా?

పవిత్ర పర్వతాలలో మీ హృదిని దోచే

ఆ వృక్షముల, రాళ్ళ సౌందర్యం మీ ఇంటిలో ఉన్నదా?

చెప్పండి.. మీ ఇళ్ళల్లో ఇవన్నీ ఉన్నాయా?

లేక కేవలం సౌఖ్యం,

సౌఖ్యం కొరకు భోగలాలసత్వమే కదా!

అది మీ ఇంటిలో అతిధి గా వచ్చి,

# జిబ్రాన్ మార్గం

ఆతిధేయిగా మారి, చివరకు నీ యజమానిగా

నీపై తిష్ట వేస్తుంది.

అది సర్కస్ లో జంతువులను

కొరడాలతో, ఇనుప సంకెళ్ళతో

నియంత్రించే శిక్షకునిగా మారి

మిమ్మల్ని పెద్ద పెద్ద కోరికలు తీర్చుకొనుటకు

తోలుబొమ్మ ఆడినట్టు ఆడిస్తుంది.

అది మిమ్మల్ని జోలపాడి మంచంపై నిదురపుచ్చి,

మీ శరీరాలను చూచి హేళన చేయును.

అది మీ ఇంద్రియాలను

పట్టు కుచ్చులతో మైమరిపించి,

వాటిని సున్నిత గాజుపాత్రలవలె

పగులగొట్టి ఆనందించును.

సుఖాలు పొందాలనే లాలస

మీ ఆత్మ యొక్క సమ్మోహనాన్ని హత్యచేసి,

అంత్యక్రియలలో పళ్ళికిలిస్తూ పాల్గొంటుంది.

కాబట్టి ఈ విశాల విశ్వానికి చెందిన వారసులారా!

# జిబ్రాన్ మార్గం

మీరు మీ విశ్రాంతిలో అవిశ్రాంతిగా  ఉంటారు.

మీరు ఈ వలలో చిక్కుకోవద్దు,

వీటికి దాసులు కావొద్దు.

మీ ఇల్లు మీకు విశ్రాంతికి పట్టుకొమ్మలు కావు,

కేవలం తెరచాపకు సహకరించు కర్ర ముక్కలు.

అవి గాయాన్ని నివారించు కట్టు కాదు

కంటిని  పూర్తిగా  కప్పివేసి అంధునిగా చేయు కంటిరెప్ప.

కావున మీరు మీ ఇంటిలోనికి

ప్రవేశించు సమయాన

మీ రెక్కలను ముడుచుకోవద్దు.

ఇంటి పైకప్పుకు తగులునేమోనని

మీ శిరస్సులను వంచవద్దు.

గోడలు బీటలు బారుననే భయంతో

శ్వాసను నియంత్రించుకోవద్దు.

కావున బ్రతికియున్నవారికోసం

నిర్మించిన సమాధుల్లాంటి ఇళ్ళల్లో

మీరు నివసించవద్దు.

# జిబ్రాన్ మార్గం

ఎంత సుందరంగా, అద్భుతంగా

మీ ఇల్లు ఉన్నప్పటికీ

అవి మీ రహస్యాలను దాచలేవు,

మీ కోరికలకు ఆశ్రయం ఇవ్వలేవు.

మీలోని  అనంతత్వాన్ని

ఉదయపు మంచుపొరలనే తలుపులను,

మధ్యాహ్నపు  గీతాలు, నిశిరాత్రి నిశ్శబ్దం

అనే గవాక్షాలను కలిగియున్న

ఆకాశపు హార్మ్యంలో విశ్రాంతిని పొందనీయండి.

## 9. దుస్తుల గురించి

ఒక నేతగాడు '**వస్త్రముల**' గురించి మాతో మాట్లాడు అనగా,

అతడు ఇలా జవాబిచ్చాడు....

మీరు ధరించే దుస్తులు మీ అందాలను

చాలా వరకు కప్పివేస్తాయే గాని,

అంద వికారాలను దాయలేవు.

మీరు ధరించే వస్త్రాలలో

# జిబ్రాన్ మార్గం

స్వేచ్ఛ ను కోరుకునేటప్పటికీ,

వాటిలో మిమ్మల్ని నియత్రించే

సంకెళ్ళను, కళ్ళెం లను పొందగలుగుతారు.

ఈ సూర్యరశ్మి, గాలి మీ దుస్తులుకు గాక

మీ ఒంటికి తగులుతుంటే ఎంత బాగుండును.

ఎందువలననగా, జీవన శ్వాస సూర్యరశ్మిలోనూ,

జీవన హస్తాలు ఈ గాలుల్లోనే కదా ఉండేది.

ఈ ఉత్తరపు చలిగాలియే ఈ దుస్తులు

వేసుకొనుటకు కారణమని మీలో కొందరంటారు.

అది నిజమేనని నేనంటాను..

సిగ్గు అనే మగ్గం మీద

మెత్తని నరాల పోగులతో

అది బట్టలు నేస్తుంది.

అది బట్టలు ఒడకడం అయిన పిదప

అడవిలో పరిహాసాలు చేస్తుంది.

చెడు దృష్టితో చూసే చూపుల నుండి

శీలాన్ని కాపాడుకొనే

కవచాలే దుస్తులు అని  మరచిపోండి.

అటువంటి చెడు దృష్టితో చూసేవారే లేకపోతె

శీలం మాట ఎక్కడ ఉంటుంది?

మనసులో చెడు బుద్ధి లేనిది ఎక్కడ?

కాని ఒక విషయం మరువద్దు..

ఏ అచ్ఛాదన లేని మీ పాదస్పర్శను

ఈ పుడమి ఆనందిస్తుందని,

ఈ గాలి మీ శిరోజాలను తాకి

కేరింతలు కొట్టాలని అభిలషిస్తుందని..

## 10. కొనడం – అమ్మడం గురించి

ఒక వర్తకుడు '**కొనడం మరియు అమ్మడం**' గురించి

తెలపమనగా  అతను ఇలా చెప్పాడు ..

జీవించడానికి  కావలసినవి

రెండు దోసిళ్ళతో  పొందుట

ఎలాగో తెలిసిఉంటే,

ఈ భూమి కావలసినవన్నీ

# జిబ్రాన్ మార్గం

కోరకుండానే ఫలిస్తూనే ఉంటుంది.

పొందిన బహుమానాలకు

తిరిగి చెల్లించవలసివి రెండే...

సంతృప్తి చెందడం,

కావలసినవాటికి కొరత లేదని భావించడమే..

న్యాయబద్ధంగా ప్రేమపూర్వకంగా

ఇచ్చిపుచ్చుకోకుండా ఉండకపోతే

అది కొద్ది మంది దురాశకు

ఇతరుల ఆకలిదప్పులకు దారితీస్తుంది.

సముద్రాలు దాటి శ్రమించి వస్తువులు తెచ్చువారు,

పొలాలలో, తోటలలో కాయకష్టం చేసి పండినవి  తెచ్చినవారు

ఒక సంత లో నేతగాల్లను, కుమ్మరులను, క్రమ్మరలను,

సుగంధద్రవ్యాలను ఏరి తెచ్చినవారను,  కలసినపుడు

ఈ పుడమితల్లి సౌహార్ద్ర తత్వాన్ని

మనసులో నిలుపుకొని,

మీ తూనికలను, కొలతలను,

పవిత్ర భావనలతో నమ్మి,

# జిబ్రాన్ మార్గం

విలువకు తగిన విలువను నిర్ణయించి

మీ వస్తువులను పరస్పరం మార్చుకోండి.

మీ మీ వ్యవహారాలలో

శ్రమంటే తెలియని సోమరులకు,

మాటలతో మీ కష్టాన్ని దోచుకునే దళారులకు

చోటిచ్చి బాధలకు లోనవ్వకండి.

వారితో మీరు తప్పనిసరిగా చెప్పాలి

“ మాతో పాటు మా పొలాల్లో కష్టించు మిత్రమా,

మా ఇతర సోదరులతో  పాటు

సముద్రాంతరాలలో వలలు పట్టుకొని బయలుదేరు..

ఎందుకంటే ఈ నేల,

ఈ సముద్రం మాకు ఇచ్చినట్టే

సమృద్ధిగా నీకు ఇస్తుంది” అని.

ఆ సంతలో ఇంకా గాయకులు,

నృత్యాలు చేసేవారు,

వాయిద్యాలు వాయించేవారు వస్తారు..

వారిచ్చే బహుమానాలు కూడా మీరు కొనండి.

# జిబ్రాన్ మార్గం

ఎందుకంటే వారు కూడా పళ్ళు, సుగంధ ఉత్పత్తులు

సేకరించువారి లాంటి వారే..

వారు తెచ్చే  బహుమానాలు

స్వప్నాల మైమరుపులతో,

పట్టు వస్త్రాల జలతారులతో

ఆత్మకు హాయి కలిగించు ఆహారం వంటివే..

సంతను వదిలి వెళ్ళినపుడు,

ఏ ఒక్కరు కూడా రిక్త హస్తాలతో

వెనుతిరగకుండా వెళ్లేటట్టు చూడండి.

మీలో అందరికంటే బడుగువాడు సైతం

తన అవసరాలు పూర్తిగా తీర్చుకొన్నప్పుడే

ఈ పుడమి తల్లి యొక్క ఆత్మ

ప్రశాంతంగా నిద్రించగలదు..

# జిబ్రాన్ మార్గం

## 11. నేరం – శిక్ష

ఆ నగరానికి చెందిన న్యాయమూర్తులలో ఒకరు

ముందుకు వచ్చి '**నేరం- శిక్ష**' గురించి

తమకు తెలియచేయమని కోరాడు.

దానికి ఆయన ఇలా బదులిచ్చాడు.

నీ ఆత్మ నీ నుండి వేరై

నిన్ను ఒంటరివాడిని చేసినప్పుడు,

నీవు రక్షణ కోల్పోయినవాడివై,

ఇతరుల పట్ల తప్పు చేస్తావు,

అది నీవు ఇతరుల పట్ల చేసినది కాదు..

నీపై నీవు చేసుకున్నదే.

ఆ తప్పు చేసిన ఫలితంగా

పుణ్యాత్ములు చేరు స్వర్గం యొక్క ముఖద్వారం వద్ద

మీరు ఎంత ఎదురుచూసిననూ

మీకు ప్రవేశం లభించదు.

నీలో ఉన్న దైవత్వం

సముద్రం వలె ఎప్పటికీ  మలినం కాలేనిది.

# జిబ్రాన్ మార్గం

సముద్రం నుండి నీటియావిరి పైకెగిసినట్లు,

చేసుకున్న పుణ్యము అనే రెక్కలతో

ఊర్ధ్వలోకాలకు పోవచ్చును.

నీ లోని దైవత్వం సూర్యకాంతి వంటిదే.

సూర్య కాంతి ఎలా అయితే

ఎలుకలు వసించు రంధ్రాల మార్గాలలోనికి,

పాము పుట్టలలోనికి ఎలా ప్రసరించలేదో,

నీలో  అంతటా కేవలం దైవత్వం  మాత్రమే ఉండదు,

ఉండేది అధిక మాత్రం మనిషి తత్వమే

కాని మానవత్వం సంపూర్ణంగా కూడా కాదు.

అది నిరాకారమైన మరగుజ్జు వలె

అస్పష్ట దారులలో  నిదురమత్తులో

తనను తాను మేల్కొలపాలని నడుస్తుంది.

నీలో ఉన్న ఆ మరగుజ్జు గురించే

ఇపుడు నేను మాట్లాడుతున్నాను.

ఎందుకంటే నీలో ఉన్న దైవత్వానికి కాని,

ఆ వికృత మరగుజ్జు కు కాని,

# జిబ్రాన్ మార్గం

నేరము గురించి గాని దానికి గల

శిక్షలగురించి తెలియదు.

అనేక మార్లు మీరు నేరస్థుని చూసినపుడు

వాడు మీలో ఒకడు కానట్లు

ఏ ఇతర గ్రహాలలోంచి మీ ప్రపంచంలోకి

వచ్చిన చొరబాటుదారుడేమో అన్నట్లు

మాట్లాడుట నేను విని యున్నాను.

కాని అత్యంత పవిత్రుడు,

స్వచ్ఛమైన ప్రవర్తన కలవాడు ఎవరైనా

మీలో ఉన్న ప్రతి ఒక్కరి ఉన్నతి  స్థితికన్నా

ఉన్నతంగా ఎదగలేడు,

అదేవిధంగా అత్యంత క్రూరుడు, బలహీనుడు ఎవడైనా,

మీ లో ఉన్న ప్రతి ఒక్కరి  అధోగతి కన్నా

క్రిందకు దిగజారలేడని చెబుతున్నాను.

నిశ్శబ్దంగా ఉండే వృక్షం యొక్క

సమూలగ్రానికి తెలియకుండా

ఏ ఒక్క ఆకు కూడా పండుటాకుగా మారలేదు.

# జిబ్రాన్ మార్గం

అదే విధంగా మీ అందరియొక్క

దాచిపెట్టబడిన మనసులకు తెలియకుండా

ఏ నేరస్తుడు  ఏ నేరం చేయలేడు.

మీ అందరూ కలసి ఒక ఊరేగింపు వలే

గుంపుగా మీ దైవత్వం వైపు కొనసాగుతుంటారు.

మార్గమూ మీరే, పాదచారులూ మీరే.

నడిచేవాడు ఒకవేళ పాకుడు రాళ్ళ వలన జారిపడితే,

అతడు తన వెనుక వచ్చువారికోసం

ఒక హెచ్చరిక లాంటివాడే.

వాడి పతనానికి కారణం,

వాడి ముందు నడిచిన వారు వానికన్నా

వేగంగా, ధృడమైన అడుగులతో నడిచారే కాని

జారుడుమెట్టు తొలగించక పోవడమే.

అంతేకాదు , మీ హృదయాలకు

నా మాటలు గట్టిగా తగిలినా,

హంతకుడు తాను  చేసిన హత్యకు  బాధ్యుడు కాదు;

# జిబ్రాన్ మార్గం

దోపిడీదారు తాను చేసిన దోపిడీకి

నిందించవలసినవాడు కాదు.

ధర్మవర్తనులు దుర్మార్గులు చేసిన పనుల పట్ల

అమాయకులేమీ కాదు.

నీతిమంతులు నేరస్తుల పనుల పట్ల

పవిత్రులేమీ కాదు.

నిందారోపణకు  గుర్తైనవాడు అనేకమార్లు

దెబ్బతిన్న వారికి బలైనవాడే.

అయినప్పటికీ  ఏ మచ్చలు లేని,

నిందలు లేని వారి నిందలయొక్క,

ఛీత్కారముల యొక్క భారమును మోయువాడే.

అన్యాయమునుండి  న్యాయమును,

చెడు నుండి మంచిని వేరుచేయుట

సాధ్యము కాని పని;

బట్టలో నలుపు, తెలుపు దారపు పోగులు

అల్లబడి యున్నట్టు

ఈ ప్రపంచం ముందు అవి కలిసే ఉండును.

# జిబ్రాన్ మార్గం

ఒకవేళ నల్లని దారం తెగినట్లయితే

నేతవాడు బట్టను పూర్తిగా చూసి,

మగ్గం లో గల లోపాన్ని పరిశీలిస్తాడు.

మీలో ఎవరైనా అవిశ్వాసంగా యున్న

ఒకని భార్యను విచారించుటకు తీసుకువస్తే,

అవే ప్రమాణాలతో  ఆమె భర్త హృదయాన్ని కొలవండి,

అవే తూనికలతో అతని ఆత్మయొక్క విశ్వాసాన్ని తూచండి.

ఆమెను  కొరడాలతో శిక్షించువాడు,

ఆ అభియోగం మోపినవాని

ఆత్మను కూడా పరిశీలించవలె.

ధర్మప్రవర్తన పేరుమీద

మీరు ఎవరినైనా శిక్షించదలిస్తే

గొడ్డలి వేయవలసినది

మ్రానుపై కాదు దాని మూలం పైన.

అలా వెతుకువాడు వాస్తవానికి

ఈ పుడమి హృదయంలో

ఫలవంతమైన, ఫలవంతంకాని,

# జిబ్రాన్ మార్గం

మంచి, చెడు అనే వృక్షంయొక్క మూల వ్యవస్థ
ఒకదానితో ఒకటి విడదీయలేని విధంగా
కలిసి యుండుట గమనిస్తాడు
ఎవడు న్యాయవంతుడని మీరు తీర్పు చెబుతారు?
దేహం పట్ల నిజాయితి కలిగియుండి,
ఆత్మ పట్ల దొంగబుద్ధిని కలిగియున్న వానికి
ఏ తీర్పును ప్రవచిస్తారు.
తన చేతులతో ఒకరిని చంపి,
తన మనసులో తన అంతరాత్మను
చంపుకున్నవానికి అంతకన్నా
పెద్ద జరిమానా మీరు విధిస్తారు?
దురాగతాలకు లోనై, మోసానికి గురై,
ఆగ్రహంతో తిరగబడిన వాని
అపరాధాన్ని ఎలా విచారిస్తారు?
తాము చేసిన తప్పులను మించిన పశ్చాతాపంతో
నలుగుతున్న వారికి ఎలా శిక్షిస్తారు?
మీరు చేసిన చట్టాల యొక్క ఉద్దేశ్యం

# జిబ్రాన్ మార్గం

పశ్చాతాపం పొందుటయే

సరియైన న్యాయమని కాదా?

అమాయకులలో

మీరు పశ్చాతాపం కలిగించలేరు,

అపరాధులలో పశ్చాతాపం తొలగించలేరు.

నిశీధి సమయంలో మసక వెలుతురులో

ఒకరినొకరు గుర్తించకపోవచ్చు.

కాని మెలుకవ వచ్చిన పిదప

వెలుగు లో  ప్రతిఒక్కరు

తనను తానూ పూర్తిగా శోధించుకోవచ్చును.

కావున పూర్తి వెలుగులో అన్ని సాక్ష్యాలను

పరిశీలించనిదే న్యాయమును

ఎలా గుర్తించగలుగుతారు?

పూర్తి ఆధారాలతో పరిశీలించిన  పిదప

నిర్దోషిగా నిలబడినవాడు ఎవడు?

అపరాధిగా పతనమైనవాడు ఎవడు?

ఎలా గుర్తించగలుగుతారు?

# జిబ్రాన్ మార్గం

కాని  మనిషి లో ఉండే దైవత్వమనే పగటికి,

రాత్రి అనే మరగుజ్జుతనానికి మధ్య

సాయంత్రం సమయాన నిలిచి యున్న వ్యక్తిని

ఎలా గుర్తించగలుగుతారు?

ఆలయపు శిఖరాన ఉన్న రాయి,

ఆలయ పునాదిరాయి కన్నా ఉన్నతంగా ఉండదు.

అన్నీ దేవాలయం లోని అంతర్భాగమే.

## 12. శాసనాల గురించి

అంతలో ఒక న్యాయవాది "అయ్యా! శాసనాల సంగతేమిటి?" అని

అడుగగా అతడు ఇలా జవాబిచ్చాడు.

శాసనాలు ఎంత ఆనందంగా ఏర్పరచుతారో,

వాటిని ఉల్లంఘించడంలో

మరింత ఆనందం పొందుతుంటారు.

చిన్నపిల్లలు సముద్రపు ఒడ్డున సైకతసౌధాలు

కడు శ్రద్ధతో, ఆసక్తితో నిర్మించి,

# జిబ్రాన్ మార్గం

పిదప కేరింతలు కొడుతూ

వాటిని ధ్వంసం చేస్తుంటారు.

కాని మీరు ఇసుక భవనాలు కడుతుండగా

సముద్రం మరింత ఇసుక ఒడ్డుకు తీసుకువస్తుంది.

మీరు వాటిని పడగొట్టినప్పుడు

సముద్రం కూడా మీతో బాటు నవ్వుతుంది.

వాస్తవానికి సముద్రం ఎప్పుడూ

అమాయకులతో కలసి నవ్వుతూనే ఉంటుంది.

కాని సముద్రం జీవితం కానివాడికి,

శాసనాలు సైకతభవనాలు కానివాడికి

వాటితో ఏమిటి పని?

ఎవరికైతే జీవితం ఒక శిలయో,

శాసనాలు శిల్పంగా మార్చు ఉలి వంటివో

వారు తమ జీవితాన్ని

తమ అభిరుచికి తగ్గట్టుగా మలచుకుంటారు.

కుంటివారు నాట్యగత్తెలను ద్వేషిస్తే ఒరిగేది ఏమిటి?

తనను కట్టి యుంచిన రాటను ప్రేమించే ఎద్దు

# జిబ్రాన్ మార్గం

అడవిలో లక్ష్యం లేకుండా సంచరించే

జింకలను, లేళ్ళను, ఏ ధృష్టి తో చూస్తే ఏముంది?

కుబుసము వీడలేక ముదుసలి అయిన సర్పం

విచ్చలవిడిగా స్వేచ్ఛగా తిరిగే ఇతర సర్పాలను

నగ్నంగా నిస్సిగ్గుగా తిరుగుతున్నాయని

నిందిస్తే ఏమిటి ప్రయోజనం?

విందు భోజనము ఆరగించుటకు,

అందరికంటే ముందుగా వచ్చి,

సుష్టిగా పీకల వరకు తిని,

భుక్తాయాసం తో కదలలేక తిరిగి వెళ్తూ,

విందు ఆరగిస్తున్న ఇతర అతిధులను చూసి

వారు  పద్ధతిగా తినుట  లేదు,

భోజన నియమాలు ఉల్లంఘిస్తున్నారని

నిందిస్తే  ఏమిటి ప్రయోజనం?

వీరందరూ అందరి వలే

సూర్యరశ్మిలో నిల్చున్నవారే.

కాకపోతే సూర్యుని వైపు వీపు పెట్టి

# జిబ్రాన్ మార్గం

నిల్చున్నవారు మాత్రమే..

వారు చూసేది తమ నీడలనే..

వారి నీడలే వారి శాసనాలు.

సూర్యుడు వారికి కేవలం

నీడలు ఏర్పరుచువాడు మాత్రమే.

భూమి పై సాగిలపడి వారి

నీడలకు ముద్రలు తీయుట

శాసనాలను గుర్తించుట కాదు.

సూర్యుని ఎదురుగా నీవు నడుస్తున్నప్పుడు

ఏ నీడలు నిన్ను పట్టుకుని ఆపగలవు?

గాలికి అనుగుణంగా నీవు ప్రయాణిస్తున్నప్పుడు

ఏ వాయుమాపనం నీకు దశానిర్దేశం చేస్తుంది?

నిన్ను కట్టి ఉంచిన నీ సంకెళ్ళను,

కట్టి యుంచిన రాటను త్రెంచుకున్నప్పుడు

ఏ శాసనం నిన్ను బంధించగలదు?

ఏ కారాగారం నిన్ను ఖైదు చేయగలదు?

ఎవరి సంకెళ్లకు అడ్డుకాకుండా

# జిబ్రాన్ మార్గం

నీవు  నాట్యం చేయగలిగితే

ఏ శాసనాలకు భయపడాలి?

నీ దుస్తులు నీవు చించి

ఎవరి మార్గంలో పడివేయకుండా ఉన్నట్లయితే

ఎవరు నిన్ను న్యాయస్థానం ముందు నిలబెట్టగలరు?

**ఓ అర్ఫలీజు నగర వాసులారా!**

మీరు డప్పుల  చప్పుల్లను ఆపగలరు..

వీణల తీగలను త్రుంచివేయగలరు

కాని ఆకాశం లో  ఎగిరే పక్షిని

పాడకుండా ఉండమని శాసించ గలరా?

## 13. స్వేచ్ఛ గురించి

ఒక వక్త  **'స్వేచ్ఛ'** గురించి తమకు తెలియచేయమని అడిగాడు.....

దానికి అతడు ఇలా జవాబిచ్చాడు.....

నిష్కారణంగా వధించు, నియంత పాదాల వద్ద

ఒక బానిస వినయంతో సాగిలపడి

స్తుతించు విధానమున,

# జిబ్రాన్ మార్గం

మీరు  రాజ్య ముఖద్వారం వద్ద,

మీ ఇంటిలో చలికాచుకొను కుంపటి వద్ద,

మీ స్వేచ్ఛా, స్వతంత్రాలకు సాగిలపడి

పూజించుట నేను చూచియుంటిని.

గుడి  ఆవరణలో గల చెట్లసముదాయమందు,

కోట బురుజు నీడల యందు,

మీలో గల సర్వ స్వతంతుడు సైతం

స్వతంత్రాన్ని ఒక సంకెళ్ల వలె,

వంధ్య రాట వలె  ధరించుట నేను చూచి

నా హృదయమందు రక్తం లోలోపల

అంతర్గతంగా స్రవించినది.

స్వేచ్ఛ గురించి మాట్లాడుట సైతం

ఒక లక్ష్యమని, ప్రయోజమని మానినపుడు,

స్వేచ్ఛను పొందాలని కోరుకొనుట కూడా

ఒక బంధనమని గ్రహించినపుడు  మాత్రమే

మీరు స్వేచ్ఛ గా ఉండగలరు.

మీ పగటి సమయాలు  చింతలకు చోటు లేనప్పుడు,

# జిబ్రాన్ మార్గం

మీ రాత్రులు ఎటువంటి కోర్కెలకు,

బాధలకు అతీతమైనప్పుడు

మీరు స్వేచ్ఛగా ఉండగలుగుతారు...

ఇవి  మీ జీవితాలలో

ఎంతగా సెగలు పెట్టినప్పటికీ

వీటికి అతీతమై, బంధరహితులై,

సహజస్వేచ్ఛతో ప్రగతికై

ముందడుగు వేయగలుగుతారు.

మీలో అవగాహన అనేది

చిగురుతొడుగు సమయాన,

నీ శ్రమించు సమయమును సంకెళ్ళతో బంధించగా,

వాటిని త్రెంచుకొననిదే

నీ రాత్రింబవళ్ళను మించి ఎలా ఎదగగలవు?

వాస్తవానికి  నీవు స్వేచ్ఛ అని దేనిని పిలుస్తున్నావో,

అది సూర్యకాంతిలో మెరుస్తూ

నీ కనులలో మెరుపులు కలిగించినప్పటికీ,

# జిబ్రాన్ మార్గం

ఈ భౌతిక బంధనాలన్నిటికన్నా అత్యంత ధృడమైనది..

స్వేచ్ఛ అంటే ఏమిటి?

నీ నిండైన వ్యక్తిత్వం ముందు ఒక చిన్న రేణువు.

కావున  స్వతంత్రుడవు కావలెననే కోర్కె వదిలిపెట్టు...

ఒక చట్టం అన్యాయమని

దానిని రద్దు చేయాలని మీరు అభిలషించినా,

అది మీ నొసటన మీ చేతుల తోనే

ఒకప్పుడు రాయబడినదే గదా!

న్యాయ గ్రంథాలను కాల్చివేయడం ద్వారా,

మీ న్యాయమూర్తుల నొసటలను కడగివేయుట ద్వారా,

వారి పై సముద్ర జలరాశులను  క్రుమ్మివేయుట ద్వారా,

ఆ చట్టాలను  తుడిచివేయజాలరు..

నిరంకుశ రాజును పదవీచ్యుతుణ్ణి చేయదలచితే,

ముందుగా మీ మనస్సులో స్థాపించబడిన

అతని సింహాసనాన్ని ధ్వంసం చేయుడు.

అభిమానధనులైన సర్వ స్వతంతులను

ఏ నియంతైనా ఎట్లు పాలించగలడు?

# జిబ్రాన్ మార్గం

స్వీయ స్వాతంత్రంలో నిరంకుశత్వమనేది

అత్మాభిమానానికి అవమానం వంటింది.

నీవు తొలగించాలనుకుంటున్న నిరంకుశత్వం,

నీపై  విధించబడినది కాదు,

నీకు నీవుగా ఎంచుకొనబడినదే.

నీవు తొలగించాలనుకుంటున్న

భయం యొక్క మూలం

భయపడుతున్న వారి చేతుల్లో కాదు

వారి హృదయాలలో ఉన్నదే.

వాస్తవానికి మీరు కోరుకునేవి, భయపడేవి,

అయిష్టపడేవి, ఆమోదించబడేవి,

వెంటబడేవి, తప్పించుకునేవి అన్నియు

మీ అంతరంగమున

ఎప్పటినుండియో సంచరిస్తూనే ఉన్నవి.

వెలుగు నీడలుగా జంటలై,

ఇవన్నియు మీలో చరిస్తూనే ఉన్నాయి.

ఒక నీడ కనుమరుగై అంతరించగా,

మిగిలియున్న కాంతి మరో కాంతికి

ఛాయగా మారుతుంటుంది.

అదేవిధంగా నీ స్వేచ్ఛ

దాని శృంఖలాలను విచ్ఛిన్నం చేయగా,

ఆ సంకెళ్ళు మరో స్వేచ్ఛకు

బంధనాలుగా మారుతూ ఉంటాయి.

## 14. హేతువు, మోహం

ఒక మత బోధకురాలు **'హేతువు, మోహం'** గురించి మాట్లాడమని

కోరగా అతను ఇలా జవాబిచ్చాడు;

మీ మోహం, అభిరుచి లకు

మీ హేతువు, తీర్పుల తో

నిరంతరం జరుగు అంతర్యుద్ధమునకు

మీ ఆత్మ తరచూ

ఒక యుద్ధ వేదిక అవుతుంది.

నేనేగనక

మీ ఆత్మలో శాంతినేర్పరచేందుకు

# జిబ్రాన్ మార్గం

మధ్యవర్తినైతే నీ అంతర్గత భావాలమధ్య యున్న
వైరుద్ధ్యాలను, అభిప్రాయ బేధాలను తొలగించి,
వాటిమధ్య సమన్వయం ఏర్పరచి
ఐక్యతారాగాన్ని ఆలపించేటట్టు చేసేవాడిని.
మీలోని విభిన్న భావాలను
అమితంగా ప్రేమించే మీరు
శాంతికాముకులుగా మారనిదే
నేను ఎలా వాటి మధ్య సమన్వయం ఏర్పరచగలను?
జీవన సాగరాన్ని దాటుతున్న
మీ ఆత్మ అనే నౌకకు  దిక్సూచి, తెరచాపల వలె
మీలోని హేతువు, మీ మోహం సహకరిస్తుంటాయి.
నడిసంద్రంలో  నావ సాగుతున్నప్పుడు
దిక్సూచి గాని  పనిచేయకపోతే
గమ్యస్థలం ఎటో తెలియక
అయోమయం ఏర్పడుతుంది,
అదే  విధంగా తెరచాపగాని విరిగినట్లయితే,
ముందుకు వెళ్ళలేక

# జిబ్రాన్ మార్గం

నిశ్చలంగా నిలిచిపోవలసి ఉంటుంది.

అదేవిధంగా  హేతువు ఒక్కటే పని చేసి,

మోహం లేకున్నా ముందుకు సాగలేరు,

అదే విధంగా కేవలం మోహం ఉండి హేతువు లేకున్నా

ఆ మంట స్వీయ వినాశానానికి దారితీస్తుంది.

కాబట్టి మీ ఆత్మ  మీ హేతువును ప్రశంసిస్తూ

మీ మోహం యొక్క సమోన్నత స్థితిలో

గానం ఆలపించడానికి ప్రోత్సహించండి.

మీలో ఉన్న మోహానికి,

హేతువు దశా దిశా నిర్దేశం చేయనీయండి.

అపుడే అది చితి బూదిలోంచి

సజీవంగా ఎగిసిన ఫీనిక్స్ పక్షి వలె

అనుదినం తనను తానూ చైతన్యపరచుకుంటుంది.

ఒకే ఇంటికి ఒకేసారి వచ్చిన ఇద్దరు అతిధులను

సమానంగా అభిమానించే విధంగా

మీ తీర్పులను, మీ అభిరుచులను

సమానంగా పరిగణించాలని

# జిబ్రాన్ మార్గం

నేను అభిలషిస్తున్నాను.

తప్పనిసరిగా ఇద్దరూ అతిథులను సమానంగా,

ఎవరిని తక్కువ చేయకుండా చూస్తారు.

ఇద్దరి పట్ల విశ్వాసం, ప్రేమ తక్కువకాకుండా చూస్తారు.

హేతువు, మోహం కూడా అంతే.

మీరు పొడుగైన చెట్ల చల్లని ప్రచ్ఛాయలో కూర్చొని

దూరంగా ఉన్న  పర్వతాలను,

పచ్చిక బయళ్ళను చూస్తూ

ఆ ప్రశాంతతను ఆస్వాదిస్తున్నపుడు,

మీ హృదయం నిశ్శబ్దంగా మీతో పలకనీయండి..

“దేవుడు హేతువు తో విశ్రాంతి గైకొనుచున్నాడు” అని.

పెనుతుఫాను వచ్చినపుడు,

పెనుగాలులు అరణ్య వృక్షాలను పెళ్లగిస్తున్నపుడు,

ఆకాశం ఉరుములతో, మెరుపులతో

మహోద్రేకంతో ఉన్నపుడు

మీ హృదయం సంభ్రమాశ్చర్యంతో చెప్పనీయండి...

“ దేవుడు మోహంతో ఉన్నాడు” అని.

దేవుని  శ్వాసలో నీవు భాగం కాబట్టి,

దేవుని  అరణ్యంలో ఒక ఆకువు కాబట్టి,

నీవు కూడా హేతువు తో విశ్రాంతి గైకొంటూ,

మోహం తో ముందుకు సాగిపో...

## 15. వేదన గురించి

అప్పుడొక వనిత '**వేదన**' గురించి తెలియచేయమని కోరగా..

అతడు పలికే......

మీ అవగాహనను ఆవరించియున్న త్వచం

విచ్ఛిన్నం కావడమే వేదన అంటే.....

ఒక ఫలం యొక్క త్వచం

ఎంతటి ధృడమైనప్పటికీ,

ఆ ఫలం రుచి నలుగురికీ అందాలంటే

అది విచ్ఛిన్నమవడం ఎలా అత్యవసరమో

అలానే వేదన అనేది కూడా అవసరం.

మీ నిత్య జీవితంలో జరుగు అధ్భుతాలకు

మీ హృదయం అబ్బురపడునట్లే,

# జిబ్రాన్ మార్గం

మీరు భరించే వేదన కూడా ఆనందం కన్నా

తక్కువ అద్భుతమైనదేమీ కాదు.

బాహ్య ప్రకృతిలో మారుతూ ఉండే

ఋతువులను నీవు అంగీకరించినట్లే

నీ హృదయంలో మారుతుండే ఋతువులను కూడా

నీవు సహజంగా అంగీకరించవలసినదే.

దుఃఖపూరితంబులైన హేమంతాలను

ప్రశాంత చిత్తంతో వీక్షించవలసినదే.

మన వేదనలో అధికభాగం

మనకు మనంగా కోరితెచ్చుకున్నదే.

జబ్బుపడిన మన అంతరంగాన్ని

నయం చేసేందుకు గాను మన లోని వైద్యుడు

ఇచ్చిన చేదుమందే వేదన అనేది.

అందువలన ఆ వైద్యునియందు

సంపూర్ణ విశ్వాసముంచి,

నిశ్శబ్దంగా, ప్రశాంతంగా

వేదన అను ఔషదమును స్వీకరించుము.

ధృడమైన, భారమైన ఆయన చేయి

అదృశ్యమైన దివ్యహస్తం చేత నడిపించబడుతుంది.

మీ పెదవులను ఆ ఔషద పాత్ర

చివుక్కుమని అనిపించినా,

ఆ పాత్రను తయారు చేయు  కుమ్మరి

తన పవిత్రమైన కన్నీటితో మట్టిని తడిపి

ఆ పాత్రకు అందమైన ఆకృతి

ఇచ్చియున్నాడని గ్రహించండి...

## 16. ఆత్మ జ్ఞానం గురించి

‘**ఆత్మ జ్ఞానం**’ గురించి మాట్లాడవలసినది గా ఒక వ్యక్తి అడుగగా

అతను ఇట్లు సమాధానమిచ్చినాడు......

మీ రేయింబవళ్ళ రహస్యాలను

మీ హృదయాలు మౌనంగా గ్రహిస్తుంటాయి.

కాని మీ హృదయాలు గ్రహించిన విషయాలను

వాటి స్పందనల ద్వారా తెలుసుకోవాలని

మీ చెవులు పరితపిస్తుంటాయి.

# జిబ్రాన్ మార్గం

మీ ఆలోచనలలో నిత్యం ఉండే విషయాలను
మాటలరూపంలో మీరు తెలుసుకోగలరు.

మీ  స్వప్నాల దిగంబర శరీరాలను
మీ మునివ్రేళ్ళతో స్పర్శించగలరు.
ఒక ఊటబావిలా మీరు ఉండగలగాలి...
బయటకు కనబడని ఉరకలెత్తే మీ ఆత్మ
ఉధృతమై ప్రవాహాలతో పరుగులెత్తుతూ,
నిరంతర కెరటాలతో ఘోషించు
జీవనసాగరం వైపు కదలాలి.
మీ అనంతమైన లోతుల్లో ఉండే గుప్త ఖజానా
మీ కనులకు తెలుస్తుంది.
నిఘూడమైన మీ జ్ఞానాన్ని తూచేందుకు
ఏ రకమైన తూకాలు వెతకవద్దు.
మీ జ్ఞానం యొక్క లోతులను కొలచేందుకు
ఏ విధమైన పరికరాలను ప్రయత్నించవద్దు.
ఎందుకంటే లెక్కింపసాధ్యంగాని,

# జిబ్రాన్ మార్గం

సరిహద్దులకు అతీతమైన

అనంతమైన సాగరం వంటివారు మీరు..

నిరపేక్షమైన సత్యాన్ని కనుగొన్నాను

అని ఎన్నడూ అనవద్దు.

ఒక సత్యాన్ని కనుగొన్నాను అని మాత్రమే పలకండి.

ఆత్మను చేరుకోగల మార్గాన్ని

తెలుసుకున్నాను అని అనవద్దు.

నేను నడిచే మార్గంపైపు

ఆత్మ నడుస్తూ రాగా

కలిసియుంటిని అని మాత్రమే పలకండి.

ఎందుకంటే ఆత్మలు

అన్ని మార్గాలవైపు నడుస్తుంటాయి.

అసంఖ్యాకమైన రెక్కలతో

వికసించే మహాపద్మం వలె

ఆత్మ తనంతట తానుగా వికసిస్తుంది.

# జిబ్రాన్ మార్గం

## 17. బోధన గురించి

**'బోధన'** గురించి మాకు తెలియచేయుమని

ఒక ఉపాధ్యాయుడు అడిగితే, అతడు పలికాడు...

" మీలో స్వాభావికంగా, పూర్ణ జాగురకత లో లేని

మొలకెత్తు తున్న మీ జ్ఞానాన్ని

ఎవరూ మీకు తెలియచేయలేరు...

మత ప్రభావంలో తన అనుచరగణం తో

సంచరించే ఏ గురువు

తన విశ్వాసాల్ని, ప్రేమనే తప్ప

తన వివేకాన్ని ఇవ్వడు..

ఒక వేళ ఆ గురువు వివేకవంతుడైతే,

తన జ్ఞాన కుహరంలోకి అడుగుపెట్టమని

విద్యార్థిని ఆహ్వానించడం కన్నా,

విద్యార్థినే తన స్వీయ మనోసౌధపు వాకిలి వైపు నడిపిస్తాడు.

ఒక ఖగోళవేత్త అంతరిక్షం గురించి

తాను ఏమి అర్థం చేసుకున్నాడో చెప్పగలడేమో గాని,

తన అవగాహనని మీకు ఇవ్వలేడు.

# జిబ్రాన్ మార్గం

విశ్వంలో ఉన్న అన్ని శ్రుతులను

ఒక సంగీతకారుడు మీకు వినపించగలడేమో గాని,

అతని స్వరంలోని ప్రతిధ్వనులను,

శ్రుతిని స్వీకరించగల అతని శ్రవణ శక్తిని

మీకు ఇవ్వలేడు.

అంకెలలో ప్రావీణ్యం పొందిన వ్యక్తి

బరువులు, కొలతలకు సంబంధించిన అంశాలను

చెప్పగలడేమో గాని,

మీతో వాటికి మించిన అంశాలను శోధింపచేయలేడు.

ఎందుకంటే ఒక వ్యక్తి దృష్టి,

మరొకని దృష్టిని విస్తృత పరచలేదు.

భగవంతుని ఎరుకలో

మీలో ఉన్న ప్రతి ఒక్కరూ విభిన్నమే, వైయుక్తమే,

కావున మీలో ప్రతి ఒక్కరు

పరమాత్మ జ్ఞానంలో, ఈ సృష్టి లో

ఆయన అవగాహన సంబందిననతవరకు

విభిన్నంగా. వైయుక్తంగా ఉండితీరాల్సిందే.

# జిబ్రాన్ మార్గం

## 18. స్నేహం గురించి

ఆ సమయమున ఒక యువకుడు **'స్నేహం'** గురించి మాట్లాడమని

అడుగగా, అతడు ఇలా  జవాబిచ్చాడు....

నీ తీర్చబడిన అవసరాలే నీ స్నేహితుడు.

ప్రేమ అనే విత్తనములు నాటబడి,

కృతజ్ఞతతో పంటను అందించు

నీ పొలం వంటివాడే స్నేహితుడు.

అతడు చలి కాలం లో వెచ్చదనం కలిగించు

కుంపటి వంటి వాడు,

సలహాలు కోసం మంత్రణం చేయు చెలికాడు.

ఆకలి చల్లార్చుటకైనా,

ప్రశాంతత పొందుటకైనా చేరదగ్గవాడు.

అతడు తన మనస్సులో మాటను  చెప్పినప్పుడు

దానికి ఔనని కాని, కాదని కాని

నిర్భీతిగా  బదులివ్వగలవు.

అతను నిశ్శబ్దంగా ఉన్నప్పటికీ

మీ హృదయం  అతని హృదయాన్ని వినడం మానదు.

# జిబ్రాన్ మార్గం

స్నేహంలో మాటలు లేకుండానే

మనసులో జనించే ఆలోచనలుగాని,

కోరికలు గాని, అంచనాలు గాని

పరస్పరం ఆనందంగా

ఎటువంటి అతిశయం లేకుండా

తెలియజేయబడుతుంటాయి.

నీ స్నేహితుని నుండి మీరు దూరమైనప్పుడు

మీరు ఏ మాత్రం బాధ పడరు.

ఒక పర్వతారోహునికి  సమతల ప్రదేశం నుండి

ఆ పర్వతం ఎలా స్పష్టంగా, సంపూర్ణంగా కనబడుతుందో,

మీ స్నేహితునిలో మీరు ఆరాధించే గుణాలు

అతను దూరమైనా  స్పష్టంగా గోచరమవుతుంటాయి.

ఆత్మను మరింత లోతుగా శోధించడమే తప్ప,

స్నేహంలో వేరు ప్రయోజనాలు ఉండనీయకు..

స్నేహం యొక్క  అంతు తెలియని లోతులను

తెలుసుకోవాలనుకోవాలని ఆశించడం తప్ప

ఇంకా ఏమీ కోరుకోవాలని  వలలు వేసినా,

# జిబ్రాన్ మార్గం

లాభసాటివి ఏవీ దొరకకపోవచ్చు.

మీ వద్ద ఉన్న అతి శ్రేష్టమైనవన్ని

మీ స్నేహితునికి ఇవ్వండి.

మీ లేమి లోతును, మీ సంపద ఉధృతిని

అతనిని తెలుసుకోనీయండి.

కాలాన్ని వృథా పరచేందుకు మాత్రమే

పనికివచ్చేవాడు స్నేహితుడు కాబోడు.

జీవితాన్ని సుసంపన్నం చేసేందుకు సమయం

స్నేహితునితో గడవనీయుడు

అతనితో తీరాల్సింది నీ శూన్యం కాదు,

నీ అవసరాన్ని తీరనీయండి.

నీ స్నేహ మధురిమ లో హాస్యానికి చోటివ్వండి,

ఆనందాలను పరస్పరం పంచుకోండి,

సునిశిత మంచుబిందువులతో,

మీ హృదయంలో ప్రభాత వేళలు మేల్కొని

పునరుత్తేజం కానీయండి..

# జిబ్రాన్ మార్గం

## 19. సంభాషణ గురించి

అపుడు ఒక విద్వాంసుడు '**సంభాషణ**' గురించి మాట్లడమనగా

అతడు ఇలా జవాబిచ్చినాడు ...

హృదయ ఏకాంతంలో

నివసించడం వీలుకానప్పుడే,

కాలయాపన నిమిత్తం,

మార్పు కోరు శబ్దముల కోసం

మీరు మీ  పెదవులను ఆశ్రయిస్తారు

వినీలాకాశంలో విహరించే

ఆలోచనలనే విహంగాలు

మాటల పంజరాల సందులలో ఇరుక్కొని,

రెక్కలు విప్పగలిగినా,

అక్కడ ఎగరడానికి అవకాశం లేక

మీ సంబాషణ తీవ్రతతో

మీ ఆలోచనలు సగం చంపబడతాయి

ఏకాంతజీవితమంటే భయపడే

# జిబ్రాన్ మార్గం

మీలో కొంతమంది

వదరుబోతులను ఆశ్రయిస్తారు

ఏకాంతజీవన నిశ్శబ్దం

వారి అంతరంగాలను నగ్నంగా

వారి కనుల ముందు ఆవిష్కరించడంతో

పలయనవాదులవుతారు.

మాట్లాడే విషయాలమీద జ్ఞానం గాని,

ముందు చూపుగాని లేనివారు

వారికే అర్థం కాని సత్యాలను వ్యక్తపరుస్తుంటారు.

తమ అంతరంగాలలో సత్యాలు కలిగియున్నవారు

ఏ మాటలద్వారా వాటిని వ్యక్తపరచరు.

నిశ్శబ్దపు శ్రుతులలో వారి ఆత్మ వికసిస్తుంటుంది.

రహదారి మలుపులో గాని,

విపణి వీధులలో గాని  నీ స్నేహితుడిని కలిస్తే,

నీ ఆత్మ నీ పెదవులను కదపని,

నీ నాలుకను నడిపించనీయి.

నీ హృదయపు సత్యాలు  అతని అత్మచేరుకునేలా

నీ స్వరంలో గల అంత: స్వరం

అతని చెవులలోగల అంత:శ్రవణంతో మాట్లాడనీయి..

మధువు యొక్క రుచి దాని రంగుని, పాత్రను

విస్మరించినపుడే స్మరించబడుతుంది..

## 20. సమయం గురించి

ఒక ఖగోళ శాస్త్రజ్ఞుడు '**కాలం**' గురించి మాట్లాడమని కోరగా

అతడు ఇలా జవాబు ఇచ్చాడు.

కొలతలకు అందని,

కొలుచుట శక్యం గాని,

కాలాన్ని కొలవాలనుకుంటారు మీరు.

కాలాన్ని గంటలుగా, రుతువులుగా విభజించి,

దానికి అనుగుణంగా మీ ప్రవర్తనను,

దినచర్యలను క్రమబద్ధీకరించుకుంటూ,

మీ ఆత్మల గమనాలను సైతం

మీరు నిర్దేశిస్తుంటారు.

కాలాన్ని ఒక ప్రవాహంగా మార్చి,

# జిబ్రాన్ మార్గం

దాని ఒడ్డుపై కూర్చొని,

దాని ప్రవాహగతులను తిలకిస్తూ ఉంటారు.

కాలాతీతమైన మీ అంతరంగం

జీవితం యొక్క కాలాతీత తత్వాన్ని

గుర్తెరిగి ఉంటుంది.

నిన్న నేటికి ఒక జ్ఞాపకం అని,

రేపు అనేది ఈనాటికి ఒక స్వప్నమని దానికి తెలుసు.

అంతేకాక, మీ మదిలో ఆనంద గీతాలు పాడుతూ,

దీర్ఘసమాలోచనలు చేసే మీ అంతరంగం

నక్షత్రాలను గగానాంతరం విసిరివేస్తూ

సృష్టిని ఏర్పడిన క్షణం నుండి

మీ లోనే నివసిస్తూ ఉంది.

ప్రేమ యొక్క శక్తి అపరిమితమని భావించనివాడు

మీలో ఎవ్వడున్నాడు?

అపరిమితమైన ఈ ప్రేమ పరిధులు లేనప్పటికీ,

వ్యక్తి కేంద్రంగా ఒక వలయంలో చిక్కి

ఒక ప్రేమ భావన నుండి మరియొక ప్రేమ భావనకు,

# జిబ్రాన్ మార్గం

ఒక ప్రేమ కథ నుండి మరియొక ప్రేమ కథకు

వర్తించక ఉండునని ఎరగనివాడెవ్వడు?

ప్రేమ వలె కాలం గూడా

అవిభాజ్యం, చలనరహితం.

అయినా నీ ఆలోచనలలో

కాలమును ఋతువులలో గణిస్తూ.

ప్రతి ఋతువును మరో ఋతువులో

అంతర్భాగం చేయనీయి.

నేటి దినమును గతకాలపు జ్ఞాపకాలతో పొదివిపట్టుకొని,

రేపటిరోజుని ప్రేమపూర్వకంగా ఆహ్వానించనీయి.

## 21. మంచి చెడు గురించి

నగర పెద్దలలో ఒకరు '**మంచి - చెడు**' గురించి మాట్లాడమని కోరగా

అతడు చెప్పడం మొదలుపెట్టాడు.

నీలో ఉన్న మంచి గురించి నేను మాట్లాడగలను,

కాని చెడుగురించి కాదు.

ఎందుకంటే చెడు అనేది

# జిబ్రాన్ మార్గం

మంచి యొక్క ఆకలి దప్పికల చేత

వేదించబడిన మంచియే.

వాస్తవానికి మంచికి ఆకలి వేస్తె

చీకటి గుహలలో సైతం ఆహారం కోసం వెతుకును.

మంచికి దప్పిక కలిగితే

మురుగునీటిని సైతం త్రాగును.

మీరు లోపల బయటా ఒకేలా ఉంటె  మీరు మంచివారే.

అలా అని లోపల ఒకలా బయటా

ఒకేలా లేనంత మాత్రాన చెడ్డవారేమీ కాదు.

అంతర్గతంగా కలహించుకునే  ఒక కుటుంబం

దొంగల గుంపు ఏమాత్రం కాదు.

అభిప్రాయ భేదాలున్న కుటుంబం మాత్రమే.

చుక్కాని లేని నావ ఒడుకుదుడుకులతో

ఒక గమ్యమన్నది లేక

దీవుల మధ్య అటు ఇటు తిరిగాడునే కాని

సముద్రపు లోతుల్లోకి మునిగిపోదు.

నిన్ను సమర్పించుకునేందుకు

# జిబ్రాన్ మార్గం

కృషి చేస్తే నీవు మంచి వాడివే.

నీ కోసం నీవు లాభ పడేందుకు

ప్రయత్నిస్తే  చెడ్డవాడివేమీ కాదు.

నీ ప్రయోజనం కోసం నీవు శ్రమించేటపుడు

భూమి పొరలను అంటి పెట్టుకొని

పుడమితల్లి చనుబాలు త్రాగుతున్న

ఒక చెట్టు యొక్క వేరులా ఉంటావు.

ఏ పండు  కూడా వేరుతో తనలా  ఉండమని,

పూర్తిగా ఫలించమని,

నిన్ను నీవు సంపూర్ణంగా అర్పించుకోమని అనలేదు.

ఇతరులకు అర్పించుకోవడం

ఒక పండుకు ఎంత అవసరమో,

వీలైనంతవరకు గ్రహించడం వేరుకు అంతే అవసరం.

ఇతరులతో మాట్లాడేటపుడు

పూర్తి జాగురుకతతో ఉంటె మీరు మంచివారు,

కాని అనవసరంగా వదరుబోతువలె

నీ నాలుక వాగినంత మాత్రాన

# జిబ్రాన్ మార్గం

మీరు చెడ్డవారేమీ కాదు.

అర్ధంలేని వాగుడు కూడా నాలుకకు

బలాన్ని చేకూర్చుతుంది .

సాహసోపేతమైన నిర్ణయాలతో,

బలమైన అడుగులతో, నీ లక్ష్యం వైపు

నీవు సాగుతుంటే మంచివాడివే.

కుంటి అడుగులతో మెల్లగా లక్ష్యమన్నది లేక

సాగినంత మాత్రాన  చెడ్డవాడివేమీ కాదు ..

కుంటినడకలు నడిచినంత మాత్రాన

వారు వెనకకు నడవరు.

వేగము, చురుకుదనం గల నీవు

దయచూపించే భావంతో

కుంటివారి ముందు వంకర నడకలు నడవవద్దు.

అసంఖ్యాకమైన విధములుగా

నీవు మంచివాడివే కావచ్చు,

నీవు మంచివాడివి కానంత మాత్రాన

చెడ్డ వాడివేమీ కాదు.

# జిబ్రాన్ మార్గం

కేవలం దేశ ద్రిమ్మరివి లేదా  సోమరివి మాత్రమే.

శోచనీయమైన విషయమేమిటంటే

అడవి జింకలు తాబేళ్ళకు చురుకుదనం నేర్పించవు.

మరింత మహోన్నతంగా ఎదగాలనే కోరిక

మీ  మంచితనంలో ఉన్నది.

అదే కోరిక అందరిలోనూ ఉన్నది.

ఆ కోరిక మీలో ఉన్న కొంతమందిలో

అరణ్య గీతాలను, కొండ శిఖరాల రహస్యాలను

దోచుకుపోతూ ఉధృతంగా కడలి వైపు

పరిగెత్తే  నదీప్రవాహం లా ఉండొచ్చు.

మరికొందరిలో ఆ కోరిక

ఒక లక్ష్యమన్నదే లేక

వంకర  టింకరగా  ప్రాకుతూ

కడలిని చేరకముందే

ఏ తీరంలోనో ఇంకిపోయే

మెల్లగా సాగు సెలయేరు లా ఉండొచ్చు.

గొప్ప గొప్ప కోరికలున్నవారు

# జిబ్రాన్ మార్గం

చిన్నపాటి లక్ష్యాలతో కదిలే వారిని

ఎందుకిలా నెమ్మదిగా, ఆగుతూ

సాగుతున్నావని అడగకండి.

దిగంబరులై నగ్నంగా సంచరించేవారిని చూసి

నిజమైన మంచివారు

నీ వంటి మీద వస్త్రం ఏదని అడగకండి.

నివసించ గూడులేని వారిని చూసి

నీ ఇల్లు ఏ విధంగా కూల్చబడినదని అడగకండి.

## 22. ప్రార్ధన గురించి

ఒక మత కన్య అతనితో **'ప్రార్ధన'** గురించి మాట్లాడమని అడుగగా

అతడు ఇలా పలికాడు.

మీకు బాధకలిగిన సమయమందు,

అవసరం ఏర్పడిన పరిస్థితులయందు

ప్రార్ధింతురు మీరు...

సంపూర్ణ ఆనందం కలుగు సమయంలోను,

# జిబ్రాన్ మార్గం

అవసరాలు పరిపూర్ణంగా తీరిన సమయంలోను కూడా

ప్రార్థించినా ఎంత బాగుండును...

అసలు ప్రార్ధన అంటే ఏమిటి ?

నిన్ను నీవు జీవన విశ్వాంతరంలోనికి

వ్యాప్తిచేసుకోవడమే.

నీ  సౌఖ్యం కొరకు,

నీ లోని గాడాంధకారాన్ని ఈ విశ్వంలోకి వెదజల్లునట్టే,

నీ ఆనందం కొరకు,

వికసిస్తున్న హృదయ ప్రభాతాలను వెదజల్లుటయే.

ప్రార్ధన సమయంలో

మీ ఆత్మను మీరు సమర్పించుకొని,

రోదించడం తప్ప మరేమీ చేయలేని స్థితిలో ఉండగా

మీ ఆత్మ  మీకు ఆనందం కలగు స్థితి ఏర్పడు వరకు

ఆ వేదనతో మిమ్మల్ని మెలితిప్పి,

మధిస్తూనే ఉంటుంది.

ప్రార్థించు సమయమున

మీ ఆత్మ పైకెగసి,

# జిబ్రాన్ మార్గం

అదే సమయమున ప్రార్థించు

ఇతరులతో కలియును.

ఎవరినైతే ప్రార్తిస్తున్నారో వారిని కలియకపోవచ్చును.

కావున మీ దేవాలయ సందర్శనను గుప్తంగా ఉంచండి.

అక్కడ మీకు తీయనైన,

ఆనందదాయకమైన కలయిక యే తప్ప,

మీరు కోరే ఏ ఇతర ప్రయోజనం సిద్దించదు.

మీరు దేవాలయం సందర్శించి

వినయంతో సాగిలపడిన ,

అక్కడ మిమ్మల్ని ఎవరు పైకెత్తరు.

ఇతరుల మంచి కొరకు ప్రార్థించిననూ

మీ మొర ఎవరూ ఆలకించరు.

మీరు నిరాడంబరంగా ఆలయమున ప్రవేశిస్తే అదే చాలు.

వివిధ శబ్దాలతో ప్రార్థన ఎలా చేయాలో

నేను మీకు నేర్పలేను.

మీ పెదవులపై ఆ పరాత్పరుడు పలికే

ఆ శబ్దాలను ఆయన వినడు.

# జిబ్రాన్ మార్గం

సముద్రాలు, అరణ్యాలు, పర్వతాలు చేయు

ప్రార్థన మీకు నేర్పలేను.

ఒక వేళ ఆ పర్వతాలకు, సముద్రాలకు, అరణ్యాలకు

మీరు జనించి ఉన్నట్లయితే,

నీ హృదయాంతరాలలో

వాటి ప్రార్థన గ్రహించి యుండగలవు.

నిశీదివేళ, నిశ్చల స్థితిలో నిశ్శబ్దంగా

అవి చేసే ప్రార్థన ఇలా ఉంటుంది.."

" మా స్థితికి, మనుగడకు కారణమైన భగవంతుడా!

మీ యొక్క సంకల్పమే మా యొక్క సంకల్పం.

మీ యొక్క కోరికలే మా కోరికలు.

మా రాత్రులు పగల్లుగాను,

పగల్లు రాత్రులుగానే పరివర్తన

మీ ఉద్దేశ్యంతో నీ జరుగుతుంది.

మా అవసరాలు మాలో జనించకపూర్వమే

మీకు విదితమౌతాయి.

కావున వాటిని తీర్చమని

# జిబ్రాన్ మార్గం

నిన్ను మేము అడగనవసరం లేదు.

మిమ్ములను పొందుటయే మా అవసరం.

నిన్ను మాకు అనుగ్రహించుటయే

మాకు మీరు ఇచ్చే గొప్ప ప్రసాదం. "

23. అందం గురించి

ఒక కవి '**అందం**' గురించి మాట్లాడమనగా..

అతడిట్లు జవాబిచ్చెను.

అందంను మీరు ఎక్కడ అన్వేషించగలరు?

అందమే మీ మార్గము కాకపొతే,

అందమే మీ మార్గదర్శి కాకపొతే,

దానిని మీరు ఎక్కడ పొందగలరు?

అందమే మీ ప్రసంగమును కూర్చియుండకపోతే తప్ప,

దాని గురించి ఎలా మాట్లాడగలరు?

వ్యధితులు, గాయబడినవారు

" అందం దయగల, మృధుస్వభావి.

యవ్వనంతో ఉన్న తల్లివలె,

# జిబ్రాన్ మార్గం

తన వైభవం పట్ల కొంత సంకోచిస్తూ

మన మధ్యకు నడుస్తూ వస్తుంది" అని అంటుంటారు.

సంమోహితులైన వారు

" అలా కాదు అందం బలమైనది, భయంకరమైనది,

ఉధృతమైన పెనుగాలి వలె, నింగి నేలను,

క్రిందా పైనా కంపింప చేయు చుండును." అని పలుకుదురు.

శారీరకంగా, మానసికంగా అలసిన అశక్తులు,

"అందం మృదువైన గుసగుసలతో

మన ఆత్మలతో సంభాషించును.

భయం యొక్క నీడలను చూచి చలించే

పలుచని కాంతి వలె మన నిశ్శబ్దంముందు,

దాని స్వరం సాగిలపడుతుంది" అని అంటుంటారు.

అసహనంగా ఉండేవాళ్ళు

" అందం పర్వతాల నడుమ

పెడబొబ్బలు పెట్టుట వినియుంటిమి.

ఆమె రోదనలలో గిట్టల చప్పుడు,

రెక్కల టప టపారవం,

# జిబ్రాన్ మార్గం

సింహపు గర్జనలు ప్రతిధ్వనించాయి" అని  తెలుపుదురు.

ఆ నగరాన్ని రేయంతా మెళుకువ ఉండి కాపలా కాచే వాడు

" తూర్పున ఉదయించే పేకువతో పాటు గా

అందం ప్రకాశిస్తుంది" అని అంటాడు.

మధ్యాహ్నపు వేళ  శ్రమించే శ్రామికులు,

నడిచే పాదచారులు

"సూర్యాస్తమయపు గవాక్షంలోనుండి

అవని లోనికి వాలిపోతుండగా

అందం ను చూసితిమి" అని తెలుపుదురు.

శీతాకాలంలో చలికి కొంకరులు తిరిగిపోయే వారు

" అందం అనేది వసంతకాల సమయంలో

పర్వతాల మీదుగా గంతులేస్తూ

వస్తుండగా చూచితిమి" అని చెబుతారు.

మండు వేసవి తాపంలో పంటకోయువారు,

" హేమంతకాల సమయాలలో

మంచు తుషార బిందువులు

# జిబ్రాన్ మార్గం

ఆమె కురులపై నడయాడుతుండగా,

ఆమె నాట్యమాడుట తాము దర్శించినాం” అని పలుకుతారు.

ఇవన్నియు మీరు అందం గురించి

పలువురు పలుకుట వినే ఉంటారు.

నిజం ఏమిటంటే ఇవన్నియు

అందం గురించి  వారు పలికిన పలుకులు కాదు,

వారి అవసరాలు తీరక,  పలికెడి మాటలు.

అందం అనేది ఒక అవసరం కాదు

ఒక ఉన్మత్త ఆనందం.

అది దాహం కోసం తపించే ఓ గొంతు కాదు,

భిక్ష కొరకు ముందుకు చాచబడిన

ఒక రిక్త హస్తం కాదు.

అది మీరు చూసే ఒక చిత్తరువు కాదు

లేదా మీరు వినే ఒక గీతం కాదు,

కాని  అది కన్నులు మూసియున్నప్పటికీ

కనబడే ఒక అందమైన చిత్తరువు,

చెవులు మూసియున్నప్పటికీ

# జిబ్రాన్ మార్గం

స్పష్టంగా వినగలిగే ఒక అద్భుత గీతమాలిక.

చిరిగిన బెరడు నుండి  కారే  స్రవం కాదు,

పంజా కు ఆనుకొనియున్న రెక్క కాదు

అందం అంటే,

వాస్తవానికి నిత్యవసంతొదయాలతో,

అలరారు పూలతోట.

అనునిత్యం ఆకసమున సంచరించే దేవదూతల గుంపు.

**ఆర్ఫలీజు నగర వాసులారా!**

ఎప్పుడైతే జీవితం తన నిండు ముఖచిత్రాన్ని

ముసుగుతీస్తుందో అదే అందం అంటే.

కాని  ఆ అందం మీరే, ఆ ముసుగు మీరే.

అందం అనేది తనను తాను

దర్పణంలో వీక్షించే అనంతం.

కాని ఆ అనంతం మీరే. ఆ దర్పణం మీరే.

# జిబ్రాన్ మార్గం

## 24. సుఖం గురించి

సంవత్సరానికి ఒక పర్యాయం ఆ పట్టణాన్ని సందర్శించే ఒక సన్యాసి

ముందుకు వచ్చి '**సుఖం**' గురించి మాట్లాడని అడుగగా,

అతడు ఇలా జవాబిచ్చెను.

సుఖమనేది ఒక స్వేచ్ఛాగీతం

కాని అది స్వేచ్ఛ కాదు.

సుఖం అంటే మీ కోరికలు ఫలించడం,

కాని వాటి ఫలితం  మాత్రం కాదు.

అది ఎత్తైన ప్రదేశమునకు పోవు పల్లం కాదు.

అది ఎత్తు కాదు. లోతు కాదు.

అది పంజరాన పట్టుబడిన

పక్షి రెక్కల శబ్దం కాదు.

పంజరపు చువ్వల మధ్య ఉన్న  ఖాళీ ప్రదేశం కాదు.

నిజమే, వాస్తవానికి సుఖమొక స్వేచ్ఛాగీతమే.

నీవు హృదయపూర్వకంగా పాడుటను అభిలషిస్తాను.

కాని ఆ గానంలో మీ హృదయాలను కోల్పోవడాన్ని

# జిబ్రాన్ మార్గం

ఏమాత్రం ఇష్టపడను.

సుఖమే జీవన సర్వస్వమని భావించిన

మీలో కొంతమంది యువకులు

సుఖాలను పొంద ప్రయత్నిస్తారు.

దానికి వారు విమర్శించబడతారు, నిందించ బడతారు.

నేను వారి తప్పులెంచను, వారిని విమర్శించను.

ఒక వేళ వారు సుఖాన్ని పొందగలిగితే,

వారిని పొందమంటాను.

కాని వారనుకొను సుఖమొకటే సుఖం కాదు.

దానికి ఏడుగురు అక్కాచెల్లెళ్లు.

వారిలో చివరిది సుఖం కన్నా అత్యంత అందమైనది.

కందమూలముల కొరకు భూమిని తవ్వు వానికి

లంకెబిందెలు దొరుకుట గురించి

మీరు వినియుండలేదా?

మీలో కొంతమంది పెద్దలు

సుఖాలను గుర్తుచేసుకొనునపుడు

వాటిని త్రాగిన మత్తులో ఉండగా చేసిన తప్పులుగా

# జిబ్రాన్ మార్గం

అంతర్గతంగా పశ్చాతాప పడతారు.

కాని పశ్చాతాపమనేది  మనసుకు మసకబరుస్తుందే,

కాని  అది ఏ రకమైన శిక్ష కాబోదు.

వారు తమ గత  సుఖాలను

వేసవికాలం లో పండిన పంట  చేతికి వచ్చినట్టు

కృతజ్ఞతతో గుర్తుకుతెచ్చుకోవాలి.

మీలో కొంతమంది సుఖాలను పొందగోరే యువకులు కారు,

గత సుఖాలకు పశ్చాతాపపడే ముసలివారు కారు.

వారు సుఖాలను పొందడం లేదా

వాటికి పశ్చాతాప పడటం అనే భయంలో,

వారి ఆత్మను నిర్లక్ష్యం చేయలేక లేదా

వాటికి విరుద్ధంగా ప్రవర్తించలేక,

వారి సుఖాలన్నిటికీ దూరంగా ఉంటారు.

ఈ విధంగా సుఖాలను త్యజించినా,

వణుకుతున్న చేతులతో

కందమూలాలకోసం తవ్వినవానికి

సంపద దొరికినట్టు వారికి సుఖం దొరుకుతుంది.

# జిబ్రాన్ మార్గం

కాని నాకు చెప్పండి

ఎవరు ఆత్మను  భంగపరుస్తారు?

నిశీదిరాత్రి పూట పాడే కోయిల

నిశ్చల మైన నిశ్శబ్దాన్ని భంగపరుస్తుందా?

రాత్రి పూట సంచరించే మిణుగురులు

చుక్కల కాంతిని భంగపరుస్తాయా?

నీ ఇంటినుండి వెలువడు పొయ్యి మంట, పొగ

వీచే గాలికి బరువు పెంచుతాయా?

నిశ్చలమైన నీటిమడుగు వంటే ఆత్మను

కర్రతో మీరు కెలుకు తారా?

అనేకమార్లు  నీవు పొందాలనుకునే

సుఖాన్ని తిరస్కరించినా,

ఆ కోర్కెను నీ అంతరంగంలో

గోప్యంగా భద్రపరచుకుంటావు.

ఈ రోజు కాదనుకొన్నది

రేపటికోసం కాచుకుండునేమో ఎవరికీ తెలుసు?

నీ శరీరంనకు సైతం

# జిబ్రాన్ మార్గం

దాని మనుగడకుకావలసిన,

తప్పనిసరిగా పొందవలసిన అవసరాలు  తెలుసు.

కాదని దానిని  మోసం చేయలేవు.

నీ ఆత్మ తన భావాలను

నీ శరీరమనే వాయిద్యం ద్వారా పలికించును.

దాని ద్వారా రణగొణధ్వనులు పలికించెదావా?

మృదు మధుర సంగీతం పలికించెదవా?

అది నీ చేతుల్లో ఉంటుంది.

ఇపుడు  నీ హృదయాన్ని అడుగు

సుఖంలో మంచిదేదో , మంచిది కానిదేదో

తేడా తెలుసుకొనుట ఎలా? అని.

పైరుపచ్చని భూములలోనున్న పూదోటలకు పోయి

తేనె ను పూలనుండి సేకరించుట

తెనేటీగకు సుఖమా?

లేక తేనెటీగ కొరకు తేనెను ఒనకూర్చి ఇచ్చుట

పూవునకు సుఖమా? అని నేర్చుకో...

తేనెటీగ కు పూవు ఒక జీవిత కాసారం.

# జిబ్రాన్ మార్గం

అదేవిధంగా పూవునకు తేనెటీగ ఒక ప్రణయ దూత .

పూవు, తేనెటీగ ఇరువురికి సుఖాన్ని ఇచ్చి పుచ్చుకొనుట

ఒక అవసరం, ఒక ఉన్మత్త ఆనందం,

**ఓ...ఆర్ఫలేజు నగర వాసులారా!**

ఆ రెండింటివలె సుఖంగా ఉండండి.....

## 25. మతం గురించి

ఒక ముదుసలి అయిన మతాచార్యుడు '**మతం**' గురించి

మాట్లాడమని కోరాడు. దానికి ఆయన మాట్లాడుతూ.....

మరి ఈ రోజు ఇంతవరకు నేను మాట్లాడినది

మతం గురించి కాక మరేమిటి?

మన చర్యలు, ప్రతి చర్యలు మతమే కదా!

ఒక వేళ చర్య లేక ప్రతిచర్య మతం కానిచో,

చేతులతో రాయి పై శిల్పం చెక్కినట్లు,

మగ్గం పై నేయబడునట్లు,

ఆత్మలో అంకురార్పణ జరిగే

ఒక అద్భుతమా? ఆశ్చర్యమా?

# జిబ్రాన్ మార్గం

ఒకరి విశ్వాసాన్ని  అతని  చర్యల నుండి
లేదా   అతని నమ్మకాలను  అతని వృత్తి నుండి
ఎవరు వేరుచేయగలరు?
ఎవరు ఒకరి కాలంను విభజించి
“ఇది దేవుని కొరకు, ఇది తన కొరకు,
ఇది ఆత్మ కొరకు, మిగిలినది అతని శరీరం కొరకు” అని
తన ముందు  ఉంచగలరు.
కాలంలోని అన్ని క్షణాలు
ఒక శరీరం  నుండి మరో శరీరం వరకు
ఆత్మ గగనంతరాల్లో సంచరించేందుకు ఉపకరించే రెక్కలే.
నైతికత అనే గొప్ప వస్త్రాలను కట్టుకొని
సంచరించుటకన్నా
దిగంబరంగా తిరుగుట మేలు.
వీచే గాలి, దహించే సూర్యరశ్మి
ఆ నైతికత అనే వస్త్రాన్ని
పీలికలు చేసి చర్మాన్ని కాల్చివేస్తాయి.
నీతి నియమాలద్వారా తన ప్రవర్తనను,

# జిబ్రాన్ మార్గం

శీలాన్ని వర్ణించుకునేవాడు,

పంజరంలో బంధించబడ్డ

స్వేచ్ఛా గాన విహంగం వంటివాడు.

పంజరపు చువ్వలనుండి, కటకటాల నుండి

అద్భుతమైన స్వేచ్ఛా గీతాలు వెలువడవు.

ఎవరికైతే  పూజ చేయడం అనేది

మూస్తూ, తీస్తూ ఉండే వెసులబాటు గల

ఒక కిటికీ  వంటిదయితే,

ఒక ఉదయం నుండి మరో ఉడయానికి

కిటికీలు తెరవబడు అవకాశం ఉన్న

తన ఆత్మ అనే  గృహాన్ని దర్శించని వాడై ఉంటాడు.

నీ దైనందిన జీవితమే

నీ యొక్క దేవాలయం, నీ యొక్క మతం.

ఎప్పుడైతే దానిలోనికి ప్రవేశించాలనుకుంటే

నీ సర్వస్వం తీసుకొని వెళ్ళు.

నీ నాగలి, మీ సుత్తి, మీ సమ్మెట. నీ  వీణ మొదలగు

నీకు  ఆనందం ఒసగే

# జిబ్రాన్ మార్గం

వాటినన్నింటినీ తీసుకొని పొమ్ము.

అక్కడ నీవు పొందే తాద్యాత్మిక స్థితియందు,

నీ విజయాలకన్నా అధికంగా ఎదిగిపోవు,

నీ పరాజయాలకన్నా లోతుగా కుంగిపోవు.

నీతో పాటుగా నీ తోటి మనుష్యులందరినీ

కూడా తీసుకుని వెళ్ళు.

వారి ఆకర్షణలో వారి ఆశలను మించి ఎగసిపోవు,

వారి నిరాశలకన్నా క్రిందకి దిగిపోవు.

నీ సమస్యలను పరిష్కరించే నిమిత్తమై

దేవుడు అక్కడ లేడని నీవు తెలుసుకుంటే,

నీ పరిసరాలలో గమనించుము,

నీ పిల్ల పాపలతో ఆడుతూ

అతడు కనిపించవచ్చును.

అంతరిక్షంలోకి పరికించుము,

మేఘాల్లో నడుస్తూనో,

మెరుపులలో తన చేతులను చాస్తూనో,

వర్షం తో బాటుగా భువిపైకి వర్షిస్తూనో,

పువ్వులలో దరహాసం చేస్తూనో,

చెట్లతో పాటుగా ఎదుగుతూ

తన చేతులను ఊపుతూనో  ఉన్న

దేవుని నీవు దర్శించగలవు.

## 26.  మరణం గురించి

అపుడు అల్ మిత్ర '**మరణం**' గురించి  ఇప్పుడు మేము

అడుగుచున్నాం.  అనగా  అతడు చెప్పడం మొదలుపెట్టాడు;

మీ అందరికీ మృత్యువు యొక్క రహస్యం తెలుసు.

కాని దానిని  మీ జీవన హృదయంలో పొందగోరనిదే

మీరు దానిని ఎట్లు పొందుతారు?

రాత్రిపూట మాత్రమే చూడగలిగే గుడ్లగూబ

పగటిపూట కాంతి యొక్క రహస్యాలను గ్రహించలేదు.

ఇప్పుడు మీరు మృత్యువు యొక్క

స్ఫూర్తిని గ్రహించాలని భావిస్తే,

మీ హృదయాన్ని సంపూర్తిగా

జీవనపర్యంతం విస్తరించండి.

# జిబ్రాన్ మార్గం

ఎందుకంటే  పారే నది,  చేరే కడలి

ఏవిధంగా ఒకటో,

అదే విధంగా జీవితానికి

చావు, బ్రతుకు రెండూ ఒకటే.

హేమంతకాలంలో మంచున దాగి యున్న విత్తనాలలో

వసంతకాలం యొక్క స్వప్నాలు ఎలా దాగి యుండునో,

అదేవిధంగా మీ ఆశల, కోర్కెల అడుగున

నిశ్శబ్దంగా అత్యున్నత జ్ఞానం దాగి యున్నది.

మీ స్వప్నాలను నమ్మండి.

ఎందుకంటే వాటిలో అనంతమైన లోకాల

సింహద్వారాలు గుప్తంగా ఉంటాయి.

మృత్యువుపట్ల మీకున్న భయం ఎటువంటిదంటే

ఒక మహారాజు చేత సన్మానం పొందుటకు

వణుకుతూ నిలుచున్న గొర్రెల కాపరి వంటిది.

వణుకుతున్న అతని మనసు లోపల

సన్మానం పొందబోతున్నాననే ఆనందం  ఉండదా?

లేదా అతను వణుకుతున్న సంగతి గుర్తించలేకున్నాడా?

# జిబ్రాన్ మార్గం

మరణించడం అంటే ఏమిటి?

నగ్నంగా గాలిలో నిలబడి

సూర్యునిలో కలసిపోవడం కదా!

శ్వాస ఆగిపోవడం అంటే ఏమిటి?

అవిశ్రాంతంగా తరంగాలవలె సాగు శ్వాసకు

విముక్తి కలిగించి

పైకి విస్తరించి భగవంతుని చేరి

బరువు వదిలించుకోడమే కదా!

నిశ్శబ్ద నదీ ప్రవాహాల జలాన్ని

సేవించినపుడే నీవు పాడగలుగుతావు.

పర్వత శిఖరాన్ని చేరుకున్న తర్వాతే

నీ ఆరోహణ  ప్రారంభమౌతుంది.

నీ అవయవాలన్నింటినీ

ఈ భూమి తనలో కలుపుకున్న తర్వాతే

నీవు నిజంగా నర్తించడం ప్రారంభిస్తావు.

# జిబ్రాన్ మార్గం

## వీడుకోలు

ఇప్పుడు సాయం సంధ్య వేళ అయింది. సన్యాసిని అయిన ఆల్ మిత్ర పలికినది." ఈ రోజు ఈ నగరం ధన్యమైనది. నీ ఆత్మ ఇంత వరకు మాతో పలికినది. దానికి ఆయన సమాధానమిచ్చాడు. " ఇంత వరకు మాట్లాడినది నేనేనా? నేను కూడా శ్రోతను కానా?

ఆ తర్వాత ఆయన ఆలయ మెట్లు దిగి ముందుకు కదలగా, ప్రజలంతా ఆయనను అనుసరించారు. ఆయన తన నౌకను చేరుకొని దాని ముందు భాగాన నిలబడినాడు. తన ముందు ఉన్న ప్రజలను ఉద్దేశించి తనం స్వరం ఎత్తినాడు..

**"ఓ ఆర్ఫలీజు నగరవాసులారా!** ఈ గాలి నన్ను మీ నుండి సెలవు తీసుకోమని కోరుతుంది. నాకు కూడా ఈ గాలి కన్నా తొందర ఎక్కువగా ఉందేమో? నేను ఇప్పుడు ఇక్కడ నుండి వెళ్లి తీరాలి. మేం ఏకాంతముగా సంచరించు ద్రిమ్మరులం. ఏ రోజు ఎక్కడ మొదలు పడతామో! ఏ రోజు ఎక్కడ ముగిస్తామో? సూర్యస్తమైన చోట ఎన్నడూ సూర్యోదయాన్ని చూడబోము.. పుడమి తల్లి నిద్రిస్తున్న సమయంలో కూడా మా పయనం సాగుతోంది. తన పక్వమును, ఫలములను చూడలేని చెట్ల యొక్క

విత్తనముల వంటివారం మేము. వీస్తున్న గాలికే మా ఫలప్రదమైన, పక్వానికొచ్చిన హృదయాలను  చెల్లా చెదరుగా పెదజెల్లి ముందుకు సాగుతాం.

మీతో నేను గడిపిన దినములు అతి స్వల్పం., నేను మీతో మాట్లాడిన మాటలు ఇంకా అల్పం. నా స్వరం మీ చెవుల నుండి నిష్క్రమించిన దినమున,  మీ జ్ఞాపకాలలో నా పట్ల ప్రేమ అస్తమించిన రోజున, నేను మరలా మరింత సౌభాగ్యవంతమైన హృదయం తో, ఆత్మను వ్యక్త పరచు మాటలతో మీ వద్దకు వస్తాను. నిజమే ఈ కెరటాలతో మరలా వస్తాను.

మృత్యువు నన్ను దాచివేసినప్పటికీ, మహా నిశ్శబ్దం నన్ను మూసివేసినప్పటికీ, నేను మీ భావాలను అర్థం చేసుకోడానికి వస్తాను. నేను చెప్పినది వ్యర్థం కాదెన్నడు? నేను చెప్పినది సత్యమే అయితే, ఆ సత్యం స్పష్టమైన స్వరంతో వ్యక్తపరచబడి, మీలో అనేకానేక ఆలోచనలను, మాటలను ఉద్భవింప చేయును.

ఓ ఆర్ఫలీజు నగర వాసులారా! గాలితో పాటే నేను కూడా సాగిపోతున్నాను, కాని శూన్యంలోకి మాత్రం కాదు.  ఈ రోజు మీ

# జిబ్రాన్ మార్గం

అవసరాలు నాచేత సంతృప్తి పరచక పోవచ్చు. కాని నా ప్రేమ తప్పని సరిగా మీకు సంతృప్తి ని కలిగిస్తుంది. మరో రోజు వచ్చు వరకు ఇదే నా ప్రమాణం, మనిషి అవసరాలు మారవచ్చు కాని ప్రేమ మారదు. ప్రేమ కు తన అవసరాలను తీర్చాలనే కోరిక కూడా మారదు.

కాబట్టి తెలుసుకోండి, ఉధృతమైన నిశ్శబ్దం నుండి నేను మరలా తిరిగి వస్తాను. తొలిమంచు సూర్యోదయం వేళకు తుషార బిందువులుగా మారి, నీటియావిరి గా మారి మబ్బు రూపు కట్టి మరలా వాన చినుకులు గా ఈ నేలను చేరుకోదా? అలాంటి తొలిమంచును కూడా కాదా నేను?

నిశ్చల నిశీధి రాత్రులలో మీ వీధుల గుండా నేను నడిచియుంటిని. నా ఆత్మ మీ ఇళ్ళల్లో చొరబడగా, మీ హృదయ స్పందనను నా హృదయ స్పందనగా, మీ శ్వాస నా మొహం పై వెచ్చగా తగలగా నేను మిమ్మల్ని పూర్తిగా తెలుసుకొనియుంటిని. నాకు మీ ఆనందాలు తెలుసు. మీ బాధలు తెలుసు. మీ నిద్రాణ స్థితిలో మీరు కన్న కలలు నా యొక్క స్వప్నాలే. పర్వత పానువుల్లో సరస్సులా నేను అన్నివేళలా మీలో ఒకడినై యున్నాను. మీ ఉన్నతిని, లోతుపాతులను, గుంపులు గుంపులుగా సంచరించిన మీ ఆలోచనలను, కోరికలను నేను ప్రతిబింబించాను. నదుల్లో దుముకుతూ గడిపిన మీ యవ్వనం, వాగుల్లో

# జిబ్రాన్ మార్గం

మీ పిల్లల కేరింతలు నిశ్శబ్దంగా పరిశీలించాను. నా హృది అంతర్భాగానికి మీరంతా చేరుకోగానే వాగులు, నదీనదాలు పాటలు పాడక స్తంభించినవి.

మీ నవ్వులను మించిన మాధుర్యం, అనుబంధాన్ని మించిన ఆప్యాయత నేను పొందియున్నాను. ఇది మీలో అపరిమితం. అనంతం. ఆ విశ్వేశురుని అంత:శరీరంలో మీరంతా కణములు వంటివారు, నాడుల వంటి వారు. మీ అందరి స్వరాలు, కేరింతలు ఆ దివ్యపురుషుని కీర్తనలో నిశ్శబ్ద ప్రతిస్పందనలు.

ఆ విశాల పురుషునిలో మీరు విశాలమైనవారు. ఆయనను పొందగోరు ప్రయత్నంలో నేను మీ అందరినీ పొంది, మిమ్మల్ని ప్రేమించినాను. ఆ విశాల విస్తీర్ణంలో ప్రేమ చొరబడని ప్రదేశం ఏది? ఏ ఊహలు, ఏ ప్రమేయాలు, ఏ అంచనాలు ఆయనను దాటి ప్రయాణించగలవు? ఒక పండ్లిచ్చు చెట్టును మరొక మహావృక్షం కప్పివేసినట్టు, మీ అంతర్భాగం లో ఆయన ఉన్నాడు. ఆ మహా శక్తియే

మిమ్మల్ని ఈ భూమిమీదకు తీసుకువచ్చినది. ఆ పరిమళమే మిమ్మల్ని గగనాంతరాలలోనికి తీసుకుపోతుంది. కలకాలముండే ఆయన శాశ్వతత్వం లో మీకు మరణం అనేది ఉండదు.

# జిబ్రాన్ మార్గం

ఒక గొలుసు లో అతి బలహీనమైన లంకె వలే మీరు బలహీనులని మీరు చెప్పబడి యున్నారు. అది అర్ధసత్యం మాత్రమే. ఆ గొలుసులో బలమైన లంకె వలె మీరు బలవంతులే. సముద్ర తరంగాల పై తేలాడు నురగను చూసి సముద్రం బలహీనమైనదని ఎంచుట ఎంత తప్పో, మీరు చేసిన ఒక స్వల్పమైన పనిని బట్టి మీ బలం, మీ స్థైర్యం అంత మాత్రమేనని లెక్కించుట తప్పు. మీ వైఫల్యాలను చూసి మిమ్మల్ని అంచనా వేయుట అస్థిరముగా వచ్చు ఋతువులను నిందించుట వంటిది.

మీరు సముద్రం వంటివారు. సరుకునింపుకున్న నౌకలు తీరంపై ప్రయాణానికి అనుకూలమైన ఆటుపోట్ల కొరకు వేచియున్నప్పుడు, సముద్రం వలే మీరు కూడా తరంగాల ఉధృతిని తొందరపెట్టలేరు. అదే విధంగా మీరు ఋతువుల వంటివారు. మీరు శీతాకాల సమయంలో దానిని ఇష్టపడక, మీలో అంతర్గతంగా ఉన్న వసంతకాలాన్ని కోరుకోవచ్చు. కాని మీలో ఉన్న వసంతకాలం ఏ మాత్రం బాధపడక తన మగతలో తానే నవ్వుకోవచ్చును.

"అతడు మనలను ప్రశంసించాడు. మనలో మంచిని ధర్శించినాడు" అని మీలో మీరు ఒకరితో ఒకరు అనుకోవాలనే ఉద్దేశ్యంతో నేను ఇలా

# జిబ్రాన్ మార్గం

చెబుతున్నానని తలవద్దు. మీ ఆలోచనలలో మీకు ఏ విషయాలు అయితే తెలుసో, వాటిని మాత్రమే మాటల రూపంలో వ్యక్తపరుస్తున్నాను. మాటల రూపంలో వ్యక్తపరచిన జ్ఞానం, మాటలరూపంలోలేని జ్ఞానం యొక్క నీడ మాత్రమే. నిన్నటి రోజులు మూటకట్టబడి, భద్రపరచబడిన జ్ఞాపకాల స్పందనల తరంగాలే మీ ఆలోచనలు, దానికి సంబంధించినవే నా మాటలు. వాటిలో భూమి తన గురించి గాని, మన గురించి గాని, ఏమీ తెలియని అయోమయపు రోజులకు సంబంధించిన విషయాలు కూడా ఉండవచ్చును.

మేధావులెందరో తమ విజ్ఞానాన్ని మీ వద్దకు వచ్చి పంచియుంటారు. ఆ జ్ఞానాన్ని తీసుకోడానికి నేను వచ్చియున్నాను. నేను మీ నుండి విజ్ఞానం కన్నా గొప్పది పొందియున్నాను. మీలో జ్వలిస్తూ ఉన్న ఆత్మయే ఆ విజ్ఞానం. మీరు దానిని విస్తరింప చేయుట మాని అంతరించిపోతున్న మీ ఆయుర్ధాయకాలం కోసం తీవ్రంగా మధన పడుతున్నారు. సమాధులకై భయపడుతున్న శరీరాలలో ఉన్న జీవనాన్ని సాధించడమే నిజమైన జీవనం అంటే. ఇక్కడ సమాధుల్లెవు, ఈ పర్వతాలు, మైదానాలు ఊయలలు, ఆరోహణా సోపనాలే.

# జిబ్రాన్ మార్గం

మీ దగ్గరకు ఎంతో మంది మీ మీద నమ్మకంతో వాగ్దానాలకోసం వచ్చియుంటారు. వారికి మీరు దానం, అధికారం, యశస్సు అందించియుంటారు. అటువంటి వాగ్దానం ఏదీ నేను మీకు ఇవ్వలేదు. కాని మీరే నా పట్ల చాలా ఉదారంగా ఉన్నారు. నాకు జీవిత లక్ష్యాల పట్ల తీవ్రమైన దాహాన్ని కలిగించారు. ఒక వ్యక్తి యొక్క జీవన లక్ష్యాలన్నింటినీ తీవ్రమైన దాహంగా మార్చి, తన జీవితాన్ని సఫలీకృతం చేసుకోవాలనే తపన ఏర్పరచడం కన్నా గొప్ప బహుమానం ఏదీ ఉండదు. దీనిలో నా గౌరవం, నా బహుమానం ఇమిడియుంది. దప్పిక తీర్చుకోడానికి నేను ఎప్పుడు ప్రయత్నిస్తే, ఆ జీవజలమే తీవ్ర దాహాన్ని కలిగియుండటం గమనించాను. నేను దాని సేవించబోగా అదే నను సేవించినది.

మీ నుండి బహుమతులు స్వీకరించుట యందు నేను గర్విష్టిగానో, బిడియస్తునిగానో ఉండటం మీరు గమనించియుంటారు. నేను బహుమానాలను గాక వేతనం గ్రహించుటకు అతిశయంతో ఉంటాను. నేను కొండ కోనల్లో దొరికే పండ్లను తినబోతుండగా మీరు నన్ను, మీ ఇంటికి కొనిపోయి మీతో పాటుగా కూర్చుండబెట్టి విందుభోజనం తినిపించియున్నారు. గుడి ఆవరణలో నిద్రించబోతుండగా, మీరు ఇంటికి నన్ను తీసుకొని వెళ్లి నిద్రపుచ్చియున్నారు. నా రాత్రులు, పగలు మీ

# జిబ్రాన్ మార్గం

ఆదరాభిమానాలతో నా నోటిని మధురం చేసి, నా నిద్రకు సౌఖ్యం చేసితిరి కదా?

అందులకు నేను మిమ్ములను అధికంగా ఆశీర్వదిస్తాను. మీరు ఇవ్వవలసినదానికన్నా అధికంగా ఇచ్చియున్నారు. వాస్తవానికి కరుణ కూడా తనను తాను అద్దంలో మురిపెంగా చూసుకుంటే అది పాషాణ హృదయం అవుతుంది. మంచి పని కూడా తనను తాను గొప్పగా భావించిన యెడల అది శాపంగా మారుతుంది.

మీలో కొందరు నన్ను ఏకాకినని, నా ఏకాంతమునే సేవింతునని, చెట్లు చేమలతో ముచ్చటించునే గాని మనుష్యులతో గాదని , అతడు కొండపైన కూర్చొని క్రింద ఉన్న నగరాన్ని చూస్తుంటాడు" అని యున్నారు. నిజమే. నేను కొండలు ఎక్కి, ఏకాంత ప్రదేశాలలో సంచరించి యున్నాను. మరి దూరము నుండి, ఎత్తు ప్రదేశాలనుండి మిమ్మల్ని ఎలా చూడగలిగాను? దూరంగా ఉండక పోతే, అతను దగ్గర ఎలా కాగలుగుతాడు? మీలో మరికొంతమంది ఇతడు అపరిచితుడు, ఎవరూ ఎక్కలేని ఎత్తులను ప్రేమించేవాడు, గ్రద్దలు గూళ్ళు కట్టుకునే ఎత్తైన శిఖరాలలో నివసించుట ఎందుకు? ఎవరూ సాధించని దానిని

సాధించాలనుకోవడం ఎందుకు? నీ వలలతో ఏ తుఫానులు పట్టు కుంటావు? ఏ పెద్ద పక్షులను నీవు ఆకాశంలో వేటాడుతావు? క్రిందకు వచ్చి మాలో ఒకడిగా ఉండు. మా రొట్టెతో నీ ఆకలి తీర్చుకో, మా మధువు తో నీ దప్పిక తీర్చుకో." అని పలికియుంటిరి.

వారి ఆత్మల ఏకాంతవాసంలో వారు ఈ మాటలు అనియుంటిరి. కాని వారి ఏకాంతం అంత లోతైనదా? వారు తప్పనిసరిగా తెలుసుకోవలసినది ఏమిటంటే నేను వారి బాధల, ఆనందాల రహస్యాలను గ్రహించియున్నానని, అంతరిక్షం లో సంచరించే మీ యొక్క ఉన్నతమైన మూర్తులను నేను శోధించానని. కాని వేటగాడు కూడా వేటాడబడతాడు. నేను సంధించిన బాణాలెన్నో నా ఎదకే తగిలియున్నాయి. ఎగిరేవి ఒక్కోసారి ప్రాకాల్సియుంటుంది. నా రెక్కలు ఆకాశం లో సూర్యునితో విహరిస్తుండగా నా నీడ భూమిపై తాబేలు వలే మందగమనం చేసేది. నా వేలితో నా గాయాన్ని తరచూ వెతికి చూసుకొనే విధంగా, నా నమ్మకాన్నే తరచూ సంశయించే వాడిని.,కాని మీ జ్ఞానం మీద, మీ మీద ఎంతో నమ్మకం కలిగి యుండేవాడిని. ఆ నమ్మకంతోనే నేను ఈ జ్ఞానాన్ని చెప్పియున్నాను. మీరు మీ శరీరాలకే పరిమితమై లేరు. మీరు నివసించే ఈ గృహాలకు, మీరు పనిచేసే పొలాలకు పరిమితమై లేరు.

# జిబ్రాన్ మార్గం

మీరు పర్వతాలకన్న ఉన్నతంగా, గాలితో సయ్యాటలాడుతూ జీవిస్తున్నారు.

వెచ్చదనం కోసం సూర్యుని వద్దకు ప్రాకుతూ వెళ్ళే, రక్షణ కోసం భూమిలో రంధ్రాలు చేసుకొని జీవించే జీవులు కారు మీరు. ఈ భూమి చుట్టూ పరిభ్రమించగల, ఈ గాలితో పయనించగల ఆత్మలు మీరు. నా మాటలు అస్పష్టంగా ఉంటె, స్పష్టత కోసం అడగండి. మొదట్లో ప్రతీ విషయం అస్పష్టంగా, పొరల చాటున ఉన్నట్టుగా ఉంటుంది. కాని చివరి వరకు కాదు. మొదట్లో మీరు నన్ను కూడా అస్పష్టంగానే చూసియుండేవారు. జీవితం జీవించినంత వరకూ అంతా మంచు తో కప్పబడినట్టు అస్పష్టంగానే యుండును, కాని స్ఫటికం వలె స్పష్టంగా ఉండదు. స్ఫటికం కూడా దానిని ఆవరించియున్న పొగమంచు అంతరించిన పిదపే స్పష్టంగా కనబడుతుందని ఎవరికి తెలుసు?

నన్ను జ్ఞాపకం ఉంచుకున్నప్పుడు ఈ విషయం కూడా జ్ఞాపకం ఉంచుకోండి. ఏదైతే బలహీనంగా కనబడి , మీలో అయోమయంగా కలిగిస్తుందో అదే బలమైనది. ధృడమైనది. మీలో సన్నగా మొదలయిన మీ ఊపిరే కదా మీ ఎముకల నిర్మాణానికి, అది దృఢవంతం అవడానికి కారణమైనది? ఈ మహత్తరమైన నగరం ఏర్పడటానికి, సర్వాంగ

# జిబ్రాన్ మార్గం

సుందరంగా తయారవడానికి కారణం ఎవరి మనసులోనో మొదలైన ఒక స్వప్నమే అన్న విషయం మీలో ఎవరికైనా జ్ఞాపకం ఉన్నదా? మీ శ్వాసలో ఉచ్ఛ్వాస నిశ్వాసాలను చూడగలరా? ఒక మీరు చూడగలిగితే, ఇక ఇతర దృశ్యాలను చూడటం ఆపివేస్తారు. మీ స్వప్నాల గుసగుసలను మీరు వినగలిగితే, ఇక ఏ ఇతర శబ్దాలను మీరు వినరు. కాని మీరు వీటిని చూడలేరు.. వినలేరు.. మీ కనులను కప్పియున్న పొరలను ఆ పొరలను ఏర్పరిచిన వాటిని తొలగించగలిగితే, మీ చెవులలో ఏ వేళ్ళతో అయితే మట్టి నింపబడినదో, వాటి చేతే ఆ మట్టి తొలగించబడితే, మీరు చూడగలరు, మీరు వినగలరు.

గుడ్డితనం గురించి తెలుసునని మీరు బాధపడరాదు. చెవిటితనం ఉందని మీరు పశ్చాతాప పడరాదు. అందువలనే అన్ని విషయాల అంతర్గత ఉద్దేశ్యం తెలుసుకొందురు. చీకటిని కూడా వెలుగు ఆశీర్వదించినట్టే, మీరు వాటిని ఆశీర్వదించగలరు.”

ఇలా వారితో పలుకుతూ, తన చుట్టూ తాను చూసుకున్నాడు. దూరంగా ఆ నౌకను నడుపు సారంగి, నౌకను నడుపు చక్రమును పట్టుకొని, తెరచాపలు పైకెత్తి, ఆ నౌకను నడపవలసిన దిశవైపు పరిశీలిస్తూ ఉండటం గమనించాడు. “ నా పడవను నడుపు సారంగి

అత్యంత ఓపిక వహించి యున్నాడు. గాలి వీస్తుంది, తెరచాపలు ఊగుతూ ఉన్నవి. దిక్సూచి కూడా దిశా నిర్దేశం చేస్తుంది. నా ప్రసంగం ఆపుతానని నా సారంగి కూడా ఎదురుచూస్తున్నాడు. ఎన్నో సముద్రాల హోరును విన్న నా నావికులు కూడా ఎంతో ఓపికతో నా మాటలు వింటూ ఉన్నారు. ఇక వారు ఉపేక్షించలేరు. నేను వెళ్ళుటకు సిద్ధంగా ఉన్నాను. నదీ ప్రవాహం సముద్రాన్ని చేరుకుంది. మరొక్కమారు ఆ మహాతల్లి తన బిడ్డను తన గుండెలకు హత్తుకుంది.

వీడ్కోలు! ఓ ఆర్ఫలీజు నగరవాసులారా! ఈ రోజు ఇక్కడితో ముగిసింది. ఒక నీటి-మొక్క రేపటి రోజున తిరిగి వికసించుటకు ముడుచుకుపోయింది. ఇక్కడ ఇంతవరకు మనకు ఏమి ఇవ్వబడినదో మనం దాచుకుందాం. ఒకవేళ అది మనకు చాలకపోయినట్లయితే, మరలా మనం అంతా కలసి, గుమికూడి వాటిని ఇచ్చువాడి వైపు మన హస్తాలు చాచి ప్రాధేయ పడుదుము.

మరలా నేను మీ వద్దకు వస్తానన్న సంగతి మరువద్దు. మరి కొద్ది సమయం తరువాత నా కోరిక కొంత మట్టిని, కొంత నురగను మరో శరీరం కోసం సేకరిస్తుంది. **"మరి కొంత సమయం తర్వాత, ఈ గాలిలో కొంత**

# జిబ్రాన్ మార్గం

**సమయం విశ్రాంతి తీసుకున్న తర్వాత నన్ను మరో మహిళ తన గర్భం ద్వారా ప్రసవిస్తుంది.”**

మీ అందరికీ వీడ్కోలు, యువకుల్లారా! మీతో నేను సమయం గడిపియున్నాను. నిన్ననే మనం స్వప్నంలో కలుసుకున్నాము. నా ఏకాంత జీవనంలో నా కోసం మీరు పాటలు పాడియున్నారు. మీ కోర్కెలతో నేను ఆకాశాన ఒక పెద్ద హార్మాన్ని నిర్మించినాను. కాని ఇపుడు మన నిద్దుర తీరిపోయింది. కల కరిగి పోయింది. ఇపుడు ఇక తెల్లవారి పోయింది. మధ్యాహ్న సమయం మించిపోతుంది. మన నడక పూర్తి కాకున్ననూ నేటి సమయం మాత్రం మించిపోయినది, మనం విడిపోక తప్పదు. జ్ఞాపకాల సంధ్య వెలుగులో మరలా మరొక్కసారి కలుసుకుందాం. మనం కలసి మాట్లాడుకుందాం. అత్యంత గాఢమైన ఒక మధుర గీతం మీరు నా కోసం పాడుదురు గాని. మరొక స్వప్నం లో మన హస్తాలన్నీ కలిపి ఆకాసంలో మరొక్క హార్మ్యాన్ని నిర్మిద్దాం.”

అని పలుకుతూ ఆ నావికులకు ఆయన చేతితో సైగ చేసాడు. వారు తిన్నగా ఆ నౌక లంగరు ఎత్తివేసి, ఆ ఓడను ఒడ్డుకు కట్టియుంచిన త్రాళ్ళను వదులు చేసి, తూర్పు దిశ గా నౌకను పయనింప చేసారు. ఆ గుంపులోంచి ఒక హృదయం నుండి పెద్ద ఏడుపు విన వచ్చింది.

# జిబ్రాన్ మార్గం

ఆ రోదనతో అంతా శృతి కలపగా, అది ఒక మహా శబ్దం గా మారి ఆ నౌక పై భాగానికి తగిలి ప్రతిధ్వనించింది.

ఒక్క అల్ మిత్రా నిశ్శబ్దంగా ఆ నౌక మంచుతెరలలో అదృశ్యమైనంత వరకు వేచి ఉంది. అందరూ అక్కడ నుండి నిష్క్రమించగా, ఆమె మాత్రం ఆ సముద్రపు ఒడ్డున ఒంటరిగా నిలబడి , ఆమె హృదయం అతను పలికిన మాటలను జ్ఞాపకం చేసుకుంటుండగా వింటూ ఉంది... " **మరి కొంత సమయం తరువాత, ఈ గాలిలో విశ్రాంతి తీసుకున్న పిదప, మరో మహిళ తన గర్భంలో నన్ను ప్రసవిస్తుంది.**"

--0—00—0—

# జిబ్రాన్ మార్గం

## అలజంగి ఉదయ కుమార్ ఇతర రచనలు

## మరియు వ్యక్తిత్వ వికాస సి. డి. లు




Give Your feedback

9948992208

traineruday kumar@gmail.com